ఆగస్టు



1975

# భారతి

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

వెల: రూపాయి న్నర




ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: V. మధుసూదనరావు

నిర్మాతలు: V.R. యాచేంద్ర, K. చటర్జీ

సంగీతం: చక్రవర్తి ఫొటోగ్రఫీ: S. వెంకటరత్నం W.I.C.A.

LAKSHMI PUBS

సోల్ డిస్ట్రిబ్యూటర్స్: లక్ష్మీ కంబైన్స్

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

ఆగస్టు 1975

సంపుటము : 52 ;     సంచిక : 8 ;

విడిప్రతిక వెల రూపాయిన్నర

# భారత ప్రజల ప్రతిజ్ఞ

దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించి వుండకపోతే
విచ్ఛిన్నకర శక్తులను వీరవిహారం చేయనిచ్చి వుంటే...
ప్రజాస్వామ్య వ్యవస్థ పటాపంచలై పోయి వుండేది

అందుకే మనదేశంలోయిటీవలచెలరేగిన స్వార్థపరులదుశ్చర్యలనుఅరికట్టక తప్పలేదు..

* అన్నింటికంటే ముఖ్యం — ఉత్పత్తి పెంచడం. పొలాల్లో, ఫ్యాక్టరీల్లో మేం మా పనులకు అంకితమై కృషి చేస్తాం. మా కృషిలో అశ్రద్ధ చూపితే ఉత్పత్తి కుంటుపడుతుందని మాకు తెలుసు. ఏ పనిలోనూ, అలసత్వం, జాప్యం యిక వుండదు. సమ్మెలూ, లాకవుట్లూ వినిపించవు.
* అన్ని రంగాలలో క్రమశిక్షణ అవసరం. పాఠశాలల్లో ఆదర్శవంతంగా నడుచుకుంటాం. ఆఫీసుల్లో క్రమశిక్షణ పాటిస్తాం.
* కుల, మత, భాషా, ప్రాంతీయ దురభిమానాలకు దూరంగా వుంటాం.
* మేం ప్రజాస్వామ్య వాదులం. కాని దేశ భద్రత ముఖ్యం. దేశం వుంటేనే ప్రజాస్వామ్యం. అభివృద్ధి కార్యక్రమాన్ని కుంటుపరిచే చర్యలను ప్రోత్సహించం.
* స్వార్థపరులు కల్పించే పుకార్లను మేం నమ్మం.
* అత్యవసర వస్తువుల ధరలు పెరక్కుండా చూస్తాం.
బ్లాక్ మార్కెట్ వంటి సామాజిక అక్రమాలను సాగనివ్వం.
* ప్రధానమంత్రి మా మేలు కోరి ప్రకటించిన ఆర్థిక కార్యక్రమం అమలు పరచడానికి అన్ని విధాలా సహకరిస్తాం.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు

No 22/75

# వి ష యా ను క్ర మ ణి క

## ఆగస్టు 1975


| | | |
|---|---|---|
| ఏందుకు నాకీ తుది? | శ్రీ జి. వి. సుబ్బారావు | 4 |
| ధర్మపదము — సౌందర నందము | శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | 6 |
| పుట్ట తపసి | శ్రీ నుదురుమాటి సత్యనారాయణశాస్త్రి | 11 |
| ఆర్థిక వ్యవస్థపై లోటు ద్రవ్యప్రభావము | శ్రీ నెల్లూరి సత్యనారాయణ | 12 |
| గాలిపటాలు | శ్రీ 'మోహన్' | 15 |
| అమరావతి స్తూపము—నేటి పురావస్తు పరిశోధనలు | శ్రీ ఇంగువ కార్తికేయశర్మ | 16 |
| ? | శ్రీ బి. స్వర్ణాంబ | 28 |
| రా. వి. శాస్త్రి నవలలు — ఒక పరిశీలన | శ్రీ వల్లంపాటి వెంకటసుబ్బయ్య | 30 |
| జ్ఞాపకం | శ్రీ కె. ఎస్. వి. నరసింహం | 35 |
| కిటికీనుండి దూకిన (వియత్నాం శాంతి కవితలనుండి) | శ్రీ మాదిరాజు రంగారావు | 39 |
| శ్రీకృష్ణదేవరాయలు కళింగ దిగ్విజయ యాత్రలో ఓటమిని చవిచూచెనా ? | డా. సి. వి. రామచంద్రరావు | 40 |
| కృష్ణశాస్త్రి సంపుటాలు | శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి | 44 |
| దుర్యోధనుడురగకేతనుడా ? | శ్రీ ఏరూరు సీతారామశర్మ | 51 |
| దక్షిణ భారతచరిత్ర చతురాస్యులు నీలకంఠ శాస్త్రిగారు | శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు | 55 |
| కలగూరగంప | | 58 |
| గ్రంథ విమర్శలు | | 61 |

# ఎందుకు నాకీ తుది?

శ్రీ జి. వి. సుబ్బారావు

ఎందుకు నాకీ తుది ?
ముందుకు పోనీదా గతివిధి ? !–
ప్రశాంతాకాశ చిత్ర ఫలకంలో
వసంతారామ లతాంతాలలా
నిరంతర మేదో అదృశ్య హస్తం
చిత్రిస్తున్న రంగుల మబ్బు తునకల
కంతమేదీ మరి ?
నినీల సాగర గర్భాంతరాలలో
అలల ననంతంగా సృష్టించి
తీరాల కపారంగా తెలినుర్వుల
ప్రసరించే కడలి కంతేదీ మరి ?
శిశిర ఋతు కుహారంలో
పండిన పత్రాలను విసర్జించి
ముసలిదైన తరుతతిని
వాసంత పికీ కుహూనాదంలో
పచ్చని నునులేత చిగుళ్ళ తొడిగి!
నవ యౌవనిన్ని, నవ్వుల పువ్వులు
నిరంతరం వర్షించటంలేదా మరి ?
అనంత కాల ప్రవాహంలో,
తిథులు, వారాలు, మాసాలు
వత్సరాలు, యుగాలు, కల్పాలు
నిరంతరం చక్రభ్రమణంలా
మరలి రావటం లేదా మరి ?
చారిత్రక బృహత్కథా శ్రవణంలో
అరని నెత్తురుమడుగులు
తీరని అసూయా ద్వేషాలు
మారని కులమత తత్వాలు
మళ్ళీ మళ్ళీ వినిపించటం లేదా మరి ?
గుళ్ళో గంటలు మళ్ళీ మళ్ళీ వినిపిస్తుంటాయి.

## ఎందుకు నాకీ తుది ?

కళ్ళల్లో సూర్యచంద్రులు దివారాత్రాలు కనిపిస్తుంటారు.
మళ్ళీ మళ్ళీ వెలుగు, చీకట్లు తెరల్లా తరలి పోతుంటా యి.
వెళ్ళినట్లే వెళ్ళి మళ్ళీ వస్తుంటాయి ఋతు సంకేతాలు.
ఈ విశాల విశ్వంలో
త్రికాలాతీతమైనవి ఎన్నో ఉన్నాయి.
ఈ విచిత్ర ప్రపంచంలో
నిర్విరామంగా సాగేవి ఎన్నో ఉన్నాయి.
ఈ అనంత త్రిభువనంలో
నిరంతరంగా పయనించేవి ఎన్నో ఉన్నాయి.
కానీ, —

వెళ్ళితే తిరిగిరాదు మానవ జీవన రథగమనం !
వెళ్ళితే తిరిగిరాదు వయోభావ సంక్రమణం !
పల్లంవైపే పయనిస్తుందీ మానవ జీవనదం !
ఉల్లం ఊతగా తిరుగులేని మలుపులు పోతుందీ భావనాశకటం !
శాశ్వత భావనా జలధి తీరసికతా తలంలో
క్షణికంగా, అల్పిష్టంగా, ముద్రవేస్తూ,
కాలాతీత తరంగోద్ధృత శీకరంలో
తిరిగి, తిరిగి, చెరిపేయబడుతూ,
అదృశ్యమౌతుందీ
అశాశ్వత ఊహామానవ శిశుపాద పల్లవం !
అనంత కాలసాగర హృదయాంతరంలో
అనంత తానే బిందు రూపంలో
లీనమై పోతుందీ
మానవ జీవన వాహినీ పథం !
పునర్జన్మతో పునరావృతమౌతుందా జీవితం ?
మనోబుద్ధ్యహంకారాలతో పునీతమౌతుందా జీవనం ?
ఎందుకీ ద్వైవిధ్యం ?
ఎందుకీ వైరుధ్యం ?
ఎందుకు మనిషికీ అంతం ?
ఎందుకు మానవ జీవితానికీ సమాప్తం
ఎందుకు నాకీతుది ?
ముందుకు పోనీదా గతవిధి ? !



# * ధర్మపదము - సౌందరనందము

## శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

లలిత కళలు నిర్వాణ మార్గమునకుఁ జిక్కు యెదురని హీనయాన బౌద్ధులు భావించిరి. వారు శుద్ధ శ్రోత్రియుల వంటివారు. విశుద్ధిమార్గము, దశధర్మ సూత్రము, మహాపరినిర్వాణ సూత్రము, మిళింద పశ్నము, సూత్రనిపాతము మున్నగు బౌద్ధగ్రంథములు హీనయాన బౌద్ధులకు లలిత కళలపట్ల నెంత యేవగింపు కలదో గడగట్టి గంటవాయించుచున్నవి. దశధర్మ సూత్రము "శారీరక సౌందర్యము గానిండు, వేషభాషా సౌందర్యము గానిండు నాకు కాలిగోటితో తుల్యము" అని వక్కాణించుచున్నది, ఇఁక సూత్రనిపాతమో "ఇంద్రియార్థములు చిత్రవిచిత్రములు, మనోజ్ఞములు. మధురములు. అవి విరూపములై చిత్తమును మథించును" అని చాటుచున్నది. నేపాళ దేశమునఁ బ్రచలితములయిన బౌద్ధగాథ లీసత్యమునే సమర్థించుచున్నవి. అందొక గాథ యిట్లున్నది. ఒకానొక నటుఁడు బౌద్ధాచార్యుఁడగు నాగాసందుని దర్శించి, బుద్ధుని జీవితగాథను దృశ్య కావ్యముగా రచించి యిచ్చిన, దానిని బ్రదర్శించి బ్రదుకుదునని చెప్పెను. అంతట నాగ్రహావిష్టుఁడై యాయాచార్యుఁ డానటునితో "నీచుఁడా! మేము నీ కొఱకు బుద్ధభగవానుని కథను దృశ్యకావ్యముగా రచింపవలయునా? పోపొమ్ము. నీకొక యక్షరము ముక్కయినఁ జెప్పను" అని యనెను.

బుద్ధభగవానుఁడే కావ్యత్వశోభితములగు కవుల రచనములకు బద్ధవిరోధియని బ్రహ్మజాలసూత్రము భాషించుచున్నది. తథాగతుఁడు కేవలము ముక్తకాది రచనముల యెడనేకాక మహాకావ్యములయెడ నైతము వైముఖ్యము చూపెనని మనము భావింపవలయును. దీనికి మహాకవి అశ్వఘోషుని వ్రాతలే సాక్ష్యములు. కవికుల గురువగు అశ్వఘోషుఁడు "సౌందరనందము" వంటి మహాకావ్యమును రచించి చివరకు * "మోక్షార్థగర్భమయిన యీ కావ్యము శాంతికొఱకే కాని రసానందము కొఱకుఁగాదు. అన్యవిషయాసక్తులగు శ్రోతల నాకర్షించుటకై కావ్యోపచారము నిందుఁ బాటించితిని. మోక్షభిన్న విషయము లిందు నెలకొని యుండవచ్చు. అవి కేవలము కావ్యధర్మమును బట్టి యుపకరించినవి తేనెతోఁ గూడిన చేఁదుమందు సేవించుట సులభముగదా!" అని చెప్పికొనవలసిన వాఁడయ్యెను.

బౌద్ధులకు లలితకళలయెడఁగల యీ వైముఖ్యము పెద్దకాలము కొనసాగలేదు. కాలక్రమమున జనుల చిత్తప్రవృత్తిని, సంఘప్రవృత్తిని కాచి వడఁబోసినవారు లలితకళలను సమ్మానించిరి. భారతీయ శిల్పకళకు నగమునకుఁబైఁగా వన్నెలు చిన్నెలు దిద్దినవారు బౌద్ధులే. నూతన శిల్పకళా సంప్రదాయములు నెలకొల్పినవారు బౌద్ధులే అగ్నేయా—ఆసియాకు విజ్ఞానభిక్ష పెట్టినదియు వారే. అది యట్లుండనిండు. ఇఁక భారతీయ సాహిత్య ప్రపంచమున బౌద్ధులది యొక ప్రత్యేక స్థానము. ఆదికావ్యమగు రామాయణము రచిత

---

* కలకత్తా విశ్వవిద్యాలయమున పాలీభాషాచార్యుఁడయిన నళినాక్షదత్త గారికిమహావిద్వాంసునకుముందుగా నమోవాకములర్పింపవలయును. వాత్సల్యపూర్వకమగు వారి తోడ్పాటు లేనినాఁడు నే నీ వ్యాసము వ్రాయుట దుస్సాధము. లండన్ పాలీ టెక్స్ట్ సొసైటీ గ్రంథమాలిక క్రింద హెచ్. సి. నార్మన్ ధమ్మపద వ్యాఖ్యానమును బ్రచురించెను. అందు 13,14, 150 గాథల వ్యాఖ్యానమున సుందరీనందుల వృత్తాంతము కలదు. పాలీభాషారూపమునున్న యీ వృత్తాంతభాగమునే ఆచార్య నళినాక్షదత్తగారికిఁ బంపితిని. వారు దయతో దాని యాంగ్లానువాదమును బంపి పాలీ వాఙ్మయమందలి సుందరీనందుల కథను సుగ్రహ మొనర్చిరి. ఆంధ్ర విద్వాంసులు చూపలేని నెనరు చూపిరి. ఆర్జవము, మహాపాండిత్యముగల విద్వాంసుల పోకడ లిట్లే యుండును.

* ఇత్యేషా వ్యుపశాంతయే న రతయే మోక్షార్థగర్భాకృతిః
శ్రోతౄణాం గ్రహణార్థ మన్యమనసాం కావ్యోపచారా త్కృతా
య న్మోక్షాత్కృతమన్య దత్ర హి మయా తత్కావ్యధర్మా త్కృతం
పాతుం తిక్త మివౌషధం మధుయుతం హృద్యం కథం స్యాదితి

మయిన పిదప మహాకావ్య రిలావతి వల భులయిననారు బౌద్ధులే. వారిలోఁ బ్రఖ్యాత స్మరణీయుఁడు అశ్వఘోషుఁడు. అశ్వఘోషుఁడు రచించిన మహాకావ్యములు రెండు. 1. బుద్ధచరిత్రము 2. సౌందరనందము. మొదటిది యసమగ్రముగా లభించెను. రెండవది సంపూర్ణముగా లభించెను. సుందరీనందుల వృత్తాంతము వర్ణితమయిన కావ్యము సౌందరనందము. సౌందరనందమను నామధేయము వ్యాకరణ దోషజుష్టమని వక్కాణించి, యది మహాకవి ప్రౌఢ ప్రయోగమనకు లక్ష్యమని కొందఱు శబ్దశాస్త్రజ్ఞులు సంభావించిరి. అశ్వఘోషుఁ డంతవఱకు నదృష్టవంతుఁడు!

రామాయణగాథ భిన్న భిన్న దేశభాషలలో భిన్నభిన్న రూపములు ధరించినట్లే సుందరీనందుల గాథయు పాలీ సంస్కృత వాఙ్మయములందు భిన్నరూపములతో సాక్షాత్కరించుచున్నది. అశ్వఘోషుఁడు సౌందరనంద కావ్యమునే రచించెను గదా! తదనంతర కాలమున క్షేమేంద్రుఁడు "బోధిసత్త్వావదాన కల్పలత"లో నొక పల్లవమును సుందరీనందులకు సమర్పించెను. వీరిరువురు వర్ణించిన సుందరీనందుల గాథలలో భేదము కలదు. ఇంక పాలీవాఙ్మయమునఁ గల సుందరీనందుల గాథ సంస్కృత వాఙ్మయస్థమగు దానిమండి భేదించుచున్నది. తద్విశేషములే యీ వ్యాసము.

హిందువులకు భగవద్గీత యెట్టిదో బౌద్ధులకు ధమ్మపదమట్టిది. బుద్ధ ప్రవచనములు గాథారూపమున నిందుఁ గలవు. బుద్ధుఁడు గాథారూపమున భాషించెనా? యనునదొక ప్రశ్నము. భాషించెనని యెవ్వరనినను జెల్లదు. వాక్యరూపమున నున్న బుద్ధబోధలు కాలాంతరమున గాథలుగా (గాథయొక ఛందోభేదము) రూపొందినవి. ధమ్మపదము నెవ్వరు రచించిరో చెప్పఁజాలము. చైనీయులు ఆర్య ధర్మత్రాత యనువాఁడు దీనిని రచించెనని విశ్వసించుచున్నారు. అతఁ డెప్పటివాఁడో యెవ్వరికిని దెలియదు. ప్రథమ సంగీతి (బుద్ధ ప్రవచనములకు సుస్థిరరూపము కల్పించుటకు జరిగిన ప్రథమ మహాసభ. బుద్ధుఁడు మహాపరినిర్వాణము పొందిన వెంటనే రాజగృహమున జరిగిన దిది) కాలమునుండియు ధమ్మపదము బుద్ధభాషితమే యను పూజ పొందెను. బౌద్ధులకు మాననీయములగు త్రిపిటకములలో సుత్తపిటక మొకటి. అది యైదు నికాయములుగా విభక్తము. వానిలో ఖుద్దకనికాయ మొకటి. ఆ ఖుద్దకనికాయమునందలి యొక యంగమే ధమ్మపదము.

ధమ్మపదమున 423 గాథలు గలవు. ఆ గాథ లిరువది యాఱు వర్గములుగా రూపొందినవి. ఇట్టి ధమ్మపదమునకు 'ధమ్మపద—అట్ఠకథ" యను వ్యాఖ్యానము కలదు. దానిని బుద్ధఘోషాచార్యుఁడు రచించెనందురు. రచింపలేదనిన వారును గలరు. ధమ్మపదమునందలి ప్రతిగాథకు బుద్ధుని జీవనమందు సంభవించిన సన్నివేశములతోడి సంబంధము చూపఁబడును. ధమ్మపద వ్యాఖ్యానమున గాథార్థము వివరించునపు డొక కథ నుదాహరించు పద్ధతి కలదు. ఆ కథను గూడ బుద్ధుఁడు చెప్పెనని బౌద్ధులు విశ్వసింతురు. ధమ్మపదమునందలి 13, 14 గాథల వ్యాఖ్యానమున నందుని వృత్తాంతము కలదు. 150వ గాథను వ్యాఖ్యానించునపుడు సుందరీ ప్రస్తావము కలదు.

నందుని గూర్చి బుద్ధభగవానుఁ డీ గాథలు పలికినట్లు ధమ్మపదమున నున్నది. ఈ రెండిటిలో మొదటిది ప్రవ్రజ్యా స్వీకారమునకు ముందు నందుని చిత్తవృత్తి యెట్టులున్నదో తెలియఁజేయునట! రెండవది సంబోధి పొందిన నందుని చిత్తవృత్తిని నిరూపించునట!

1. యథా అగారం దుచ్ఛన్నం వుట్ఠి సమతి విజ్ఝతి
ఏవం అభావితం చిత్తం రాగో సమతి విజ్ఝతి

2. యథా అగారం సుచ్ఛన్నం వుట్ఠి న సమతి విజ్ఝతి
ఏవం సుభావితం చిత్తం రాగో న సమతి విజ్ఝతి

"బాగుగాఁ గప్పనియింట వాన కురియునటు లశిక్షిత చిత్తమున రాగము ప్రవేశించును. చక్కగాఁ గప్పిన యింట వాన చినుకయిన బడనియట్లు సుశిక్షితచిత్తమున రాగము ప్రవేశింపదు" ఈ గాథలయందలి అభావిత సుభావిత పదములు బౌద్ధదర్శనమునఁ బారిభాషిక పదములు. ఈ గాథా వ్యాఖ్యానమున నందుని కథ యీ విధముగా నున్నది.

అది రెండవరోజు. నందకుమారునకు నభిషేక గృహప్రవేశ వివాహాది శుభకార్యములు జరుగు దినమది. భిక్షాటనమునకు బయలుదేరిన బుద్ధుఁడు ప్రవేశించి, నందకుమారునకు భిక్షాపాత్ర యొసఁగి మంగళాశాసనము గావించెను. పిదప శాసనము వీడి వెళ్ళుచుండెనే కాని యాయన నందుని చేతినుండి భిక్షాపాత్ర తిరిగి తీసికొనలేదు. నందుఁడును బుద్ధునిపట్ల గల పూజ్యభావముచే 'భదంతా! భిక్షా

పాత్ర స్వీకరింపు"మని యనలేకపోయెను. పైగా నతఁడు "దేశికుఁడు సోపాన శీర్షమునఁ దప్పక భిక్షాపాత్ర తీసికొను"నని మనసులో ననుకొనెను. కాని యా ప్రదేశమున నైతము ఆచార్యుఁడు భిక్షాపాత్రను దిరిగి తీసికోలేదు. అప్పుడు నందుఁడు "సోపాన పాద ప్రదేశమున దానిని దీసికొనునేమో!" యని తలంచెను. అక్కడఁ గూడ బుద్ధుఁడు భిక్షాపాత్ర తిరిగి పుచ్చుకొనలేదు. అంతట నందుఁడు "రాజసౌధాంగణమున స్వీకరించు"నని యనుకొనెను. అక్కడ నైతము బుద్ధుఁడు స్వీకరింపలేదు. వెనుదిరిగి వచ్చుటకు వేగిరపడుచున్న నందకుమారుఁడు తిరస్కార భావముతో బుద్ధుని వెంటనంటి పోవువాఁడైనను, ఆతని యందలి గౌరవ భావమువలన "ఆచార్యా! మీ భిక్షాపాత్ర మీరే తీసుకొనుఁ"డని యనఁజాలఁడయ్యెను. పైపెచ్చు "ఇక్కడఁ దీసికొనునేమో! అక్కడఁ దీసికొనునేమో!" యని యాలోచించుచుండెను. ఆ సమయమున సఖులు జనపదకల్యాణి (సుందరి)తో "అమ్మా! బుద్ధభగవానుఁడు నందకుమారుని దన వెంటఁ గొనిపోవుచున్నాఁడు. అయనకు మీకు వియోగము తప్పదనిరి. ఆర్ద్ర వికీర్ణ కేశి యగు నామె వెలుపలికి వచ్చి "ప్రియా! శీఘ్రముగాఁ దిరిగి రమ్ము" అని కేకలిడెను. ఆ మాటలు నందుని హృదయమున నాటుకొనెను.

నందుని చేతినుండి భిక్షాపాత్ర స్వీకరింపకయే యాచార్యుఁ డతనిని విహారమునకుఁ గొనిపోయి యతనితో "నందా! సంన్యసింతువా?" యని యడిగెను. గురునియెడ్ల పూజ్యభావముగల నందుఁడు "నేను సంన్యసింప"నని చెప్పలేక పోయెను. పైగా "తప్పక సంన్యసింతు"నని పలికెను. అంతట శాస్త (యొక భిక్షువుతో "నందునకు సంన్యసన దీక్షయిం"డని పలికెను. ఆచార్యుఁడు కపిలపురమున కేగిన మూఁడవనాఁడు నందుడు ప్రవ్రజ్యాస్వీకారము గావించెను.

బుద్ధభగవానుఁడు జేతవనమున నుండెను. నందుఁడు పర మోత్కంఠితుఁడై భిక్షువులతో ",నాకీ బ్రహ్మచర్యమున నభిరతిలేదు. ఈ బ్రహ్మచారి బ్రదుకు నేను భరింపలేను. ఈ నియమబంధనముల నెల్లఁ ద్రెంచుకొని పోయి నేను గృహస్థ జీవితమును గడుపుదు"నని యనెను. నందుని విషయము బుద్ధభగవానుని చెవిని బడెను. అంతట తథాగతుఁడు నందునిఁబిలిచి "నందా! నీవు భిక్షువులతో నాకీ బ్రహ్మచర్యమున నభిరతి లేదనియు, ఈ బ్రహ్మచారిబ్రదుకు నేను భరింపలేననియు, ఈ నియమబంధనములనెల్లఁ ద్రెంచుకొనిపోయి గృహస్థ జీవితమును గడుపుదునని [illegible] బలికితివఁట. ఇది నిజమా?" యని యడిగెను. "అవును. నిజమే" యని నందుఁ డనెను. అపుడు బుద్ధభగవానుఁడు "నందా! ఏల నీకు బ్రహ్మచర్యమున నభిరతిలేదు? ఏల నీవు బ్రహ్మచారి బ్రదుకును భరింపలేవు? ఏల నీవు నియమముల నెల్లఁ ద్రోసి రాజని గృహస్థ జీవితమును గడపనెంతువు?" అని యడిగెను. దానికి నందుఁడు "నేను వచ్చునపుడు ఆర్ద్ర వికీర్ణ కేశి, శాక్యాంగన యగు జనపద కల్యాణి నన్నుఁజూచి "ప్రియా! శీఘ్రముగా రమ్ము" అని పలికెను. ఆ మాటయు నా స్మృతిని బాయుటలేదు. కావున నాకీ బ్రహ్మచర్యపాలనమున నిచ్చలేదు...నేను గృహస్థ జీవితమును గడప నెంచుచున్నాను" అని బదులాడెను.

అప్పుడు బుద్ధభగవానుఁడు నందుని చేయిపట్టి తన దివ్యశక్తిచే నతనిని త్రయస్త్రింశద్దేవ లోకమునకుఁ గొనిపోయెను. దారిలో నాయన చెవులు, ముక్కు, వ్రేళ్లు కాలి వికృత రూపముతో బుగ్గియయిన పొలమున కాలిపోయిన మోడుమీఁదఁ గూర్చున్న యొక మర్కటాంగనను నాతనికిఁ జూపెను. పిదప ఇంద్ర సేవాపరాయణలు, పారావతపాద సదృశచరణలునగు పంచశతాప్సరోంగనలను జూపి బుద్ధుఁడు "ఏమందువు నందా! శాక్యాంగన యగు జనపద కల్యాణి అభిరూపతరయా? దర్శనీయయా? లేక యీ యప్సరోంగనలు అభిరూపతరలా? దర్శనీయలా?" యని యడిగెను. అంత నందుఁడు "ఆర్యా! కన్నులు, చెవులు, వ్రేళ్లు కాలి వికృతముగానున్న మర్కటాంగన యెట్టిదో శాక్యాంగన జనపద కల్యాణియు నట్టిదే. ఆమె యీ యప్సరోంగనల కాలిగోటికి సమానము గాదు. వీరే అభిరూపతరలు, దర్శనీయలు." అని యనెను. అప్పుడు తథాగతుఁడు "నందా! ఆనందింపుము. పారావత పాద సదృశ చరణలగు నీ యమర రమణులలో నొక సుందరిని పొందగా నీకుఁ దోడ్పడుదును." అని పలికెను. "అట్లయినఁ దామాదేశించు విధమున నేను బ్రహ్మచర్య పాలనము గావింతు"నని నందుఁడు పలికెను. పిదప బుద్ధభగవానుఁడు నందునితోపాటు జేతవనమునకుఁ దిరిగి వచ్చెను.

'బుద్ధభగవానుని సవతితమ్ముఁడగు నందుఁడు దివ్యాంగనాసిద్ధ్యర్థము బ్రహ్మచర్యపాలనము గావించుచున్నాఁడు. తథాగతుఁడును పారావత పాదసదృశ చరణలగు దేవాంగనలను సమకూర్తునని తన తమ్మునకు మాట యిచ్చెను" అను పలుకులు భిక్షువుల చెవిని బడినవి. నందకుమారుని సహచరులగు వారతనిని వస్తువినిమయ వ్యాపార నిపుణుడగు బేహారియని పరిహసింపఁ బ్రారంభించిరి. వారు "నందకుమారుఁడు నిజముగా గొప్ప బేహారి. పారావత పాద

నాదృశ చరణలగు దేహాంగనల కొఱకే యీ బకధ్యానము గావించు చున్నాఁ''డని పలుకఁజాగిరి. ఈ విధముగా భిక్షువులుపాలంభించుటచే నందకుమారుఁడు తన్నుఁ దానే యేవగించుకొనెను. తన యింద్రియ లౌల్యమునకు సిగు చెందెను. అతఁడు తన సర్వశక్తులు వినియోగించి, కఠోర ప్రయత్నములు గావించి ధ్యానియై యచిరకాలమున నంత ర్ముఖుఁడయ్యెను. తుదకు నర్హతుఁడాయెను.

ఒకానొక దేవత యొకనాఁటి రాత్రి జేతవనమునెల్ల దివ్యతేజః ప్రపూరితముఁజేసి, బుద్ధభగవానుని సమీపించి నమస్కరించెను. "మీ సవతితమ్ముఁడు నందకుమారుఁ డర్హతుఁడాయె"నని విన్న వించెను తథాగతుఁడు, నందకుమారుః డర్హతు డాయెనని తన దివ్య జ్ఞానముచే గ్రహించెను:

ఆ రేయి గడచిన తరువాత నందకుమారుఁడు బుద్ధభగవా నుని దర్శించి "భదంతా! అప్సరోంగనలను సమకూర్తునని తాము నాకు మాట యిచ్చితిరి. ఈనాఁడామాట నిలుపుకొననలసి యక్కఱలే దనెను. ఈ విధముగా నాయుష్మంతుఁడగు నందకుమారుఁడు తథా గతుని వాగ్దానభంగమునుండి తప్పించెను. అంతట బుద్ధభగవానుఁడు "నందా! నీ మనస్సెట్లు పనిచేయు చున్నదో నాకుఁ దెలియును. నాకుఁ బరేంగితజ్ఞానము కలదు. సర్వపాప నిర్మూలనము గావించి నందుఁడు జీవన్ముక్తుఁడాయెను–దేవతయు నాకీ మాటయే చెప్పెనుఁ నీవు పాపవిముక్తుఁడవైతివి. నేను వాగ్దాన విముక్తుఁడనైతి"నని వక్కాణించెను.

ధమ్మపద వ్యాఖ్యానమునఁగల నందకుమారుని వృత్తాంతమిది. నందకుమార ప్రోక్తములని చెప్పఁబడు రెండు గాథలు "థేర గాథలోఁ గలవు. అర్హతుఁడై నందుఁడు వానిని జెప్పెనఁట! ఆ గాథల తాత్పర్యమిది:—

"పూర్వము నేను అబోధోపహతుఁడను, అపూర్ణ చిత్తుఁడనై దాంభిక జీవనము గడపితిని. నేను చపలుఁడను, ఉద్ధతుఁడను, కామాంధుఁడను. సూర్యవంశీయుఁడు, ఉపాయ కుశలుఁడునగు బుద్ధుఁడు భవబంధమోచనము గావించి నన్ను జ్ఞానిని జేసెను."

## 2

ధమ్మపదమునం దీ గాథ కలదు. బుద్ధభగవానుఁడు సుందరి నుద్దేశించి యీ గాథ పలికెనఁట.

"అట్ఠీనం నగరం కతం మంసలోహిత లేపనమ్
యత్థ జరాచ మచ్చు చ మానో మక్ఖో చ ఓహితో"

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణుని ధమ్మపద ప్రతియందును, చౌఖంబా విద్యాభవన ప్రతియందును "కత్వా" యను దానికి "కతం" అను పాఠాంతరము కలదు. ఈ గాథార్థ మిది:—

"ఎముకలచే నొకానొక నగరము (దుర్గము) నిర్మితమాయెను. అందు జరామృత్యు దురహంకార మూర్ఖత్వములు వసించును"

ఈ గాథార్థమునకు లక్ష్యమయిన యొక కథ "విశుద్ధి మార్గ ము"న నున్నది. ఒకానొకప్పుడు మహాతిష్య భిక్షువు అనిత్యమయిన దేహమును గూర్చి చింతించుచు అనూరాధపురోపకంఠమునఁ బోవు చుండెను. సుందర వేషధారిణియగు నొక రమణి యతనిని దాఁటి పోయెను. ఆమె వల్లభునితో వాదుచేసి పోవుచుండెను. ఆమె మహా తిష్యుని జూచి పండ్లెల్ల బయటఁబెట్టి యొకనవ్వు విసరెను. ఆమె నన్వేషించుచు వచ్చుచున్న భర్త మహాతిష్యుని జూచి "అయ్యా! యొకానొక స్త్రీ యిటు పోవుట తాము చూచితిరా?" యని యడి గెను. అంతట మహాతిష్యుఁడు "నే నొక యస్థిపంజరమును మా తము చూచితిని. అది స్త్రీయో పురుషుఁడో నాకుఁ దెలియ" దనెను.

నందుని భార్య మహాసౌందర్యవతి. అందువలన నామెకు రూపా నంద, సుందరీనంద, జనపదకల్యాణి యను పేర్లు కలిగెను. ధమ్మ పద వ్యాఖ్యానమున నామెను గూర్చి యీ కథ కలదు.

ఒకానొక దినమున జనపద కల్యాణియగు సుందరి "జ్యేష్ఠ భ్రాత రాజ్యలక్ష్మిని ద్రోసిరాజని సంన్యసించెను. ఆయన పురుషో త్తముడగు బుద్ధుడాయెను. ఆయనపుత్రుఁడు రాహుల కుమారుఁడు సంన్యసించెను. నా ప్రాణవల్లభుఁడు సంన్యసించెను. మా యత్తయు సంన్యసించెను. నా బంధువు లిందఱు సంన్యసింప వే నిలు కలిగు కొని యుండి యేమి చేయుదును. నేనును సంన్యసింతు"నని యను కొనెను. ఇట్లు తలంచి యామె భిక్షుణుల కడకేగి ప్రవజ్యాస్వీకారము గావించెను. బుద్ధగత భక్తివలనఁగాక బంధు ప్రీతివలన మాత్రమే యామె సంన్యసించెను. మహాసౌందర్యవతి యగు నామెకు రూపానంద యను నామధేయము కలిగెను.

సౌందర్యమదోన్మత్తయగు నా మె యెన్నడు బుద్ధుని దర్శింప బోలేదు. నయనానందకరము, మనోహరమునగు తన సౌందర్యమున బుద్ధభగవానుఁడు దోషము లెన్నునేమోయని యామె భయము. భిక్షుణులవలన, నుపాసికల వలన తథాగతుని గుణకీర్తనము విన్న యామె "వీరెల్లరు మా బావగారిని మిక్కిలి పొగడుచునారు. ఆయన నాలావణ్యమున దోషము లెన్నునేమో! అయినప్పటికి భిక్షుణులతోపాటు వెళి వారిని దర్శించుట నా విధి. చాటుననుండి వారిని జూచి వారి ప్రవచనములు విని తిరిగి వత్తు"నని నిశ్చయించి, భిక్షుణులతో "నే నేరోజు బుద్ధ ధర్మశ్రవణార్థము మీవెంటవచ్చెద" ననెను. భిక్షుణు లెంతో సంతోషించిరి. వారు "ఎప్పటినుండియో రూపానంద తథాగతుని దర్శింపవలయునని యనుకొనుచున్నది. ఈ దినము బుద్ధభగవానుఁడు తప్పక నీయామె నుద్దేశించి విచిత్ర ధర్మోపదేశము చేయఁగల' డని భావించిరి. వారెల్లరు నామెతోపాటు బయలుదేరిరి. బయలుదేరినది మొదలు రూపానంద "నేను బుద్ధ భగవానుని యెదుటఁ బడ"నని యనుకొనఁజొచ్చెను. తథాగతుఁడు తక్కువవాఁడా? ఆయన "ఈ దినము రూపానంద నన్ను దర్శించును. ఏ ధర్మోపదేశము చేసిన బాగుగా నుండును? అమెయా! తన యందమునకుఁ దానే మురిసిపోవును. కంటకమునుగంటకముతోడనే యుద్ధరింపవలయును. నే నొక సౌందర్యరాశిని సృష్టించి యామె లావణ్య గర్వము నణఁచివేయుదు"నని నిశ్చయించెను. ఈ విధముగా నిశ్చయించుకొని, రూపానంద, విహారము ప్రవేశించునప్పటికి శాస్త్ర షోడశ వర్షప్రాయ, అరుణాంబరధారిణి, సర్వాభరణ భూషిత, యగు నొక విలాసవతిని తన దివ్యశక్తిచే సృష్టించెను. ఆమె చామర గ్రాహిణియై, నిలిచి తన కుపచారము చేయుచున్నటు చేసెను. బుద్ధభగవానుని పార్శ్వమున నున్న యా సుందరి రూపానందకుఁ గనుచూపు మేరలో నుండును.

జనపద కల్యాణి భిక్షుణులతో గూడి విహారము ప్రవేశించెను. భిక్షుణుల వెనుకనుండి సపంచాంగ నమస్కారము చేసెను. భిక్షుణుల నడుమఁ గూర్చుండి బుద్ధభగవానుని నాపాదమస్తకము తేఱి చూచెను. సకలకల్యాణలక్షణ లక్షితమైన యాయనలావణ్యమునుబాఱఁజూచెను. తథాగతుఁడు నలువైపు వెలుఁగు వెల్లువలు విరజిమ్ముచుండెను. రాకేందుబింబ సదృశమగు బుద్ధుని నెమ్మోము గాంచునపుడు రూపానంద యాయన పార్శ్వముననున్న సౌందర్యరాశిని జూచెను. ఆమె బుద్ధుని జూచినపు డాయనతోఁ దన్నుఁ బోల్చికొనెను. కాకిని రాజహంసతోఁ బోల్చినట్లు తలంచెను. ▪ చామర గ్రాహిణిని జూచినపుడు "ఆహా! ఆమెకబరీ భరమెంత మనోహరము? ఆమె కనుబొమ లెంత సొబగుగా నున్నవి?" అని యనుకొనెను. ఈ విధముగా రూపానంద యా విలాసవతిలావణ్యమును జూచి పరవశించెను.

బుద్ధభగవానుఁడు సుందరీనంద చిత్తవృత్తిని గ్రహించెను. ధర్మోపదేశము చేయుచు నాయన షోడశ వర్షప్రాయయగు నా కన్య నిరువది యేండ్ల వడుచుఁగాఁ జేసెను. అమెను జూచి రూపానంద "ఈమెరూపము పూర్వరూపముతో సమానముగా" ననుకొని తాత్కాలికముగా వైముఖ్యము భజించెను. క్రమక్రమముగా బుద్ధభగవానుఁడా చామర గ్రాహిణిని బిడ్డలుగాంచినదానిఁగా, నడివయస్సు స్త్రీగా, వ్యాధి పీడితయగు వృద్ధాంగనగాఁ జూపెను. రూపానంద యిదంతయుఁ జూచుచుండెను. ఆమె చూచిన వృద్ధాంగనకుఁ బండ్లూడెను. తల నరసెను. ఆ ముదుసలి ముందునకు వంగి, కఱ్ఱ యూఁతగాఁ గొని వణకుచుండెను. ఇది యెల్ల జూచిన సుందరీనంద విరక్త చిత్త యాయెను. అంతట శాస్త చామర గ్రాహిణిని వ్యాధిగ్రస్తగాఁ జూపెను. ఆమె కఱ్ఱ వదలి లెవ్వనేరక వైచుచు నేలమీఁదఁ బడెను. మల మూత్రములలోఁ దొఁగుచుఁ బొరలాడుచుండెను.

రూపానంద యిదంతయుఁ జూచి మునుపటికంటె నెక్కువగా విరక్తచిత్త యయ్యెను తుదకు బుద్ధభగవానుఁడు చామరగ్రాహిణి చావును జూపెను. ఆమెశరీరము పగిలిన గడ్డ కుఱుపులతో నిండి యుండెను. వానినుండి చీము, కుళ్ళిన క్రొవ్వు కాఱుచుండెను. కాకులు మొదలగు పక్షులు పొడుచుచుఁ గశ్మల పదార్థములు తినుచుండెను. అది చూచి రూపానంద "ఆమె యిక్కడి కిక్కడనే జరావ్యాధి మరణములు పొందెను. నా యీ దేహము సైతము వానిచే పాలఁబడునుగదా!" అని యనుకొనెను. దేహ మనిత్యమని యెంచిన యామె యది దుఃఖ కారణమని, నిర్జీవమని నిశ్చయించుకొనెను. ఈ అత్యంత తయలక్షితమయిన "స్థితులు" తగులఁబడు నిండ్లవలె

నామెకు గోచరించెను. మెడ క్రొక్క శవము గుదిబండగా నున్నట్లామె యనుకొనెను. అనె మనసు ధ్యానమగ్న మయ్యెను.

రూపానంద సుస్థిర ధ్యానచిత్త యగునో కాదోయని తలంచిన తథాగతుం డామెకు బాహ్యాలంబన మావశ్యకమని భావించెను. దానికిం దగిన ట్లాయన యిట్లు ధర్మోపదేశము గావించెను.

"రూపానందా! వ్యాధిగ్రస్తము పసాపూతి గంధహేయము నగు నీ కాయమును జూడుము. కశ్మల పదార్థ రాశియగు నీ దేహము మనోహరమని, శాశ్వతమని బాలిశులు భావింతురు.

ఇది యెట్టిదో అది యట్టిది. అది యెట్టిదో యిది యట్టిది. ఈ దేహము స్కంధయుతమని, స్కంధపతనానంతరము శూన్యతా నిలయమగునని భావించినవారు ఆ బంధనములనెల్ల మొదలంటఁగోసి శాంతిపరాయణు లగుదురు" ఈ యుపదేశము వినిన రూపానంద స్రోతాపన్న యాయెను.

"థేరీగాథ"లో సుందరి పలికినట్లు భావించిన గాథలు కలవు. వాని తాత్పర్య మిది :-

"అహోరాత్రము లప్రమత్తనై దేహమిట్టి (బుద్ధుఁడు వర్ణించినట్టి దని కనుగొంటిని. విజ్ఞాన బలమున నీ దేహమునకు వెడమొగము పెట్టితి.

ప్రజ్ఞావశమున, అభినివేశ దక్షతలు గలదాననై బాహ్యాభ్యంతర ములనుండి శరీర యథార్థ తత్త్వమును దర్శించితి.

శరీరమునట్ల రోఁత జనించి నే నాభ్యంతర విరక్తిని బొందితిని. అభినివేశ దక్షతలవలన సంసార విముక్తిఁగాంచి యుపశమ నిర్వాణ శాంతి స్థితి నందితిని."

—:o:—

# పుట్టతపసి

శ్రీ మదురుపాటి సత్యనారాయణ శాస్త్రి

మౌని మానసిన సరసీరుహ
వన సీమను వీచె ఝుంఝు;
పాద నియతిమై
నన లెత్తె లయ సమాక్షర
ఘన తంత్రీ స్వనము
శాప గర్భిత రచనన్

* * *

ఈ ప్రత్యక్షర సాక్షిభూతమగు సా
హిత్యమ్ములో దివ్యమై
క్షి పంబై స్థిర రూపమై మన్మణ దా
శ్మీరంపు ఖండంబునై
ప్రేమ ర్చిత పాద పంకజ రజ
స్సౌగంధ్య బాంధవ్యమై
స్వాభావిక గీతియై వెలిగె ను
శ్లోకంబు శోకాప్లుతిన్

* *

పులకలు పుట్టె పుట్టకు ప్ర
బోధ మవస్కృత; రామ మంత్ర వా
గ్విలసిత చేతనోర్మికల
వేలిమియైనవి సర్వ కామ సం
వలిత మహోఘ తూలములు;
ప్రాక్తన పుణ్య మనీష మౌనియై
తలవరి బోయ జీవిత ప
థాంతర తత్త్వము తీర్చె కైతగా.

# ఆర్థిక వ్యవస్థపై లోటు ద్రవ్య ప్రభావం

శ్రీ నెల్లూరి సత్యనారాయణ

ప్రపంచ యుద్ధాలతో అన్ని రంగాలలోను ముఖ్యంగా ఆర్థికంగా దెబ్బతిన్న దేశాలన్నీ ఆర్థికాభివృద్ధి గురించి తీవ్రంగా ఆలోచించ సాగాయి. ఈ యుద్ధాలతో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోవటమేకాక అనేక చిక్కు సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. ఆర్థికంగా సత్వరాభివృద్ధి సాధించేందుకు అవలంబింపదగిన మార్గాలన్నీ అన్వేషించి ప్రయోగించసాగారు. ఈ తరుణంలోనే మిగులు బడ్జెట్ వలన కలిగే సమస్యల గురించి వివరిస్తూ "లోటు ద్రవ్య విధానాన్ని" అనుసరించటం మంచిదని ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త కీన్స్ మహాశయుడు సూచించాడు. ఆ యా దేశాల ఆర్థిక పరిస్థితుల బట్టి వాటి కనుగుణంగా లోటుద్రవ్య విధానాన్ని అనుసరించటం అన్ని విధాలా శ్రేయస్కరమని అప్పటివరకు సాంప్రదాయసిద్ధంగా వస్తున్న మిగులు బడ్జెట్ విధానాన్ని విడనాడవలసిందిగా చెప్పాడు. అప్పటినుండి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అందులోను ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థికాభివృద్ధికి ఈ లోటు ద్రవ్యవిధానం ప్రముఖ స్థానం ఆక్రమించసాగింది.

ప్రభుత్వ వ్యయానికి పన్నులద్వారా, ప్రభుత్వ పరిశ్రమలద్వారా, ప్రభుత్వ ఋణాలద్వారా సేకరించిన వనరులు చాలనప్పుడు బడ్జెట్‌లో లోటు ఏర్పడుతుంది. ఈ బడ్జెట్‌లోని లోటును పూరించడానికి లోటు ద్రవ్యవిధానాన్ని ఒక సాధనంగా అవలంబిస్తారు. ఈ లోటును ద్రవ్యం మిగులువల్లకాని (Cash balances) కేంద్ర బ్యాంకువద్ద ఋణంచేసి కాని పూరించవచ్చు. పాశ్చాత్య దేశాలలో ఉద్దేశ్య పూర్వకంగా కల్పించిన బడ్జెట్‌లోని లోటును పూరించడాన్ని లోటు ద్రవ్య విధానమంటారు. అందువలన ప్రజల సగటు వ్యయం, సార్థకమైన డిమాండ్ పెరుగుతుంది. ఈ దేశాలలో బ్యాంకులద్వారా అదనపు పరపతిని కల్పించటం లోటు ద్రవ్య విధానమంటారు. కాని అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రభుత్వం కేంద్ర బ్యాంకునుండి అప్పు తీసుకోవటాన్ని, లోటు ద్రవ్య విధాన మంటారు. అయితే మన దేశంలో లోటు ద్రవ్య విధానానికి ఒక ప్రత్యేకమైన నిర్వచనం యివ్వడం జరిగింది. బడ్జెట్‌లో రెవిన్యూ ఖాతాపై కాని లేదా మూలధన ఖాతాలలో కాని, బడ్జెట్‌లో లోటుద్వారా స్థూల జాతీయ వ్యయానికి అదనపు వ్యయాన్ని ప్రత్యక్షంగా కల్పించడాన్ని లోటు ద్రవ్య విధాన మంటారు. ఈ పద్ధతిన ప్రభుత్వం తనకు వచ్చే రాబడికంటె అధికంగా ఖర్చుచేయటం వలన బడ్జెట్‌లో లోటు ఏర్పడుతుంది ఈ లోటును రిజర్వు బ్యాంకునుండి తీసుకున్న అప్పులో కాని క్రొత్త కరెన్సీని విడుదల చేయటంద్వారా, వాణిజ్య బ్యాంకులనుండి అప్పు తీసుకొనటం ద్వారా తనవద్ద ఉన్న నిల్వలను ఖర్చుచేయటం ద్వారా కాని పూరిస్తుంది.

ఒక దేశం లోటు ద్రవ్య విధానాన్ని అవలంబించడానికి అనేక కారణాలుంటాయి. అవన్నీ కేవలం ఆ యా దేశాల ఆర్థిక వ్యవస్థపై ఆధారపడి ఉంటాయి. కాని మన దేశంలో ఈ విధానాన్ని అవలంబించడానికి ఈ క్రింది కారణాలు చెప్పవచ్చును.

1 మన దేశంలో ప్రణాళికలకు కావలసిన వనరులను సేకరించడానికి యిది ప్రముఖ సాధనంగా ఉపయోగపడుతుంది.

2 హెచ్చు పెట్టుబడి స్థాయికి, నిరుద్యోగిత, అల్ప ఉపయోగిత కలిగిన వనరులను సమీకరించడానికి, పొదుపు ఎక్కువ చేయడానికి (అయితే యిక్కడ మనం గుర్తుంచుకోవలసిన ముఖ్య అంశం ఈ విధానం వలన కేవలం ఉన్న వనరులనే అభివృద్ధి పరచి ప్రభుత్వానికి అందుబాటులోనికి తీసుకొని వస్తుందేకాని వాస్తవికమైన వనరులను అది సృష్టించలేదు.)

3. ఆర్థికంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో జాతీయాదాయం పెరుగుదలతోపాటు, ద్రవ్యం సప్లయి కూడా పెరగాలి. ఇందుకు లోటు ద్రవ్యవిధానం ముఖ్యసాధనంగా ఉపయోగపడుతుంది.

4 ద్రవ్యోల్బణం కలగకపోయినట్లయితే లోటు ద్రవ్య విధానాన్ని అవలంబించడం హానికరంకాదు. కాబట్టి పై లక్ష్యాలను సాధించడానికి పంచవర్ష ప్రణాళికలకు కావలసిన వనరులను సేకరించడానికి ఈ విధానాన్ని మన దేశంలో అవలంబించవలసిన అవసర మేర్పడింది.

ఒక్కొక్క ప్రణాళికా కాలంలో ఎంత మొత్తాన్ని లోటు ద్రవ్యం ద్వారా సేకరించామనేది ఈ క్రింది పట్టికద్వారా తెలుసుకోవచ్చును.

| | రూ॥ కోట్లలో |
|---|---|
| మొదటి ప్రణాళిక | 420 |
| రెండవ ప్రణాళిక | 948 |
| మూడవ ప్రణాళిక | 1133 |
| వార్షిక ప్రణాళికలు (1966–69) | 1006 |
| నాల్గవ ప్రణాళిక | 2060 |

ఈ విధానం ద్వారా మొదటి ప్రణాళికలో విజయవంతమైన ఫలితాన్ని పొందటం జరిగింది. ఈ విధానంద్వారా సుమారు 420 కోట్లు అంటే మొత్తం వ్యయంలో దాదాపు ఐదోవంతు ద్రవ్యం సమీకరించటం జరిగింది. దీని ఫలితంగా ఈ ప్రణాళికా కాలంలో ద్రవ్యం సప్లయి 1950–51లో 1979 కోట్ల రూపాయలనుండి 1955–56 నాటికి 2184 కోట్ల రూపాయలకు పెరిగింది. ద్రవ్యం సప్లయి పెరిగినా ధరలుమాత్రం పెరగలేదు. పారిశ్రామిక రంగంలో 57%, వ్యవసాయరంగంలో 22% అభివృద్ధి సాధించడమే కాకుండా జాతీయాదాయం సయితం 17% పెరగటం గమనార్హం. ధరలు కూడా 17.5% తగ్గిపోవటం, విదేశీ వ్యాపార చెల్లింపులలో కూడా మిగులు ఏర్పడటం వలన మొదటి ప్రణాళికా కాలంలో లోటు ద్రవ్యవిధానం ఆశించిన సత్ఫలితాల నిచ్చిందని చెప్పవచ్చును.

మొదటి ప్రణాళికతో ఈ విధానం విజయవంతమైనదృష్ట్యా రెండో ప్రణాళికలో భారీ ఎత్తున అవలంబించటం జరిగింది. రెండవ ప్రణాళికలో 948 కోట్లు అంటే 20.6% వనరులను లోటు ద్రవ్యంద్వారా సమకూర్చటం జరిగింది దీనివలన 1956–57లో 2312 కోట్ల రూపాయిలున్న ద్రవ్యం సప్లయి 1960-61 నాటికి 2901 కోట్లకు పెరిగింది. 1960 61 ధరల ప్రాతిపదికగా ఈ ప్రణాళికలో జాతీయాదాయం 19.5 కు పెరిగింది కాని జనాభా పెరుగుదల హెచ్చుగా ఉండటంచేత తలసరి ఆదాయం 8% మాత్రమే పెరిగింది. వ్యవసాయరంగంలో 20%, పారిశ్రామికరంగంలో 55% పెరుగుదల కన్పించినది. కాని ఈ సమయంలోనే ధరలు ఉధృతంగా పెరగసాగాయి. కేవలం ఈ ఒక్క ప్రణాళికా కాలంలోనే ధరలు 22.2% పెరిగాయంటే యిక్కడినుండే ఈ లోటు విధానం ద్రవ్యోల్బణానికి దారితీయసాగిందని స్పష్టమవుతుంది.

రెండో ప్రణాళిక నేర్పిన గుణపాఠాల దృష్ట్యా మూడో ప్రణాళికలో ఈ విధానాన్ని సవరించకపోగా యింకా భారీ ఎత్తున అవలంబించారు. మూడో ప్రణాళికలో లోటు 550 కోట్లు ఉంటుందని అంచనా వేసినప్పటికినీ అది 1133 కోట్లకు పెరిగింది. దీనివలన ద్రవ్యం సప్లయి విరివిగా పెరిగింది. దీనికి తోడుగా చైనా, పాకిస్తాన్ దండయాత్రల వలన ఈ ప్రణాళికా లక్ష్యాలను చేరుకోలేకపోయింది. పారిశ్రామికరంగంలో 34% పెరుగుదల కన్పించినా, వాతావరణ పరిస్థితులు సరిగా లేనందున, కఱువులు ఏర్పడటంవలన వ్యవసాయరంగంలో ఉత్పత్తి 9% తగ్గుదల కన్పించింది. వీటికి తోడుగా ప్రభుత్వం వారి పన్నులుకూడా పెరగటంతో ధరలు 32% పెరగటమేకాక, ఆహార ధాన్యాల ధరలు 42% పెరగటం విచారించదగిన విషయం.

నాలుగో ప్రణాళిక అమలులోనికి రాకముందు అనివార్య పరిస్థితులవలన అవలంబించిన వార్షిక ప్రణాళికలో అంటే, 1966–66లో ఈ విధానం యింకా భారీ ఎత్తున అనుసరించటంతో ఆర్థిక వ్యవస్థ యింకా ఛిన్నాభిన్నమై పోయింది. పైగా 1966–67లో కఱువు సంభవించటంతో పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది.

నాలుగో ప్రణాళికలో సయితం ఈ విధానాన్ని భారీ ఎత్తున అనుసరించటం జరిగింది. ఈ ప్రణాళికలో దీనిద్వారా 850 కోట్ల వనరులు సమీకరించవచ్చని అంచనా వేసినప్పటికిని ప్రణాళికా అంతానికి యిది 2060 కోట్లు ఉంటుందని అంచనా వేయబడింది. ఈ ప్రణాళికలో ఈ వ్యయం యింత హెచ్చుకావటానికి గల కారణాలు బంగా శరణార్థుల సమస్య, ఋణ, వసతి వ్యయం పెరగటం,

మూడవ పే కమిషన్ సిఫార్సుల ననుసరించి ఉద్యోగుల జీతాలు పెరగటంవలన గత్యంతరంలేక దీనిని యిలా పెంచవలసి వచ్చింది. 1970లో 7140 కోట్ల రూపాయిలున్న ద్రవ్యం సప్లయి 1974 జనవరి నాటికి 10,355 కోట్లకు పెరిగింది. జాతీయాదాయం పెరుగుదల నామమాత్రంగానే ఉంది. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లోను నిరుత్సాహకరమైన అభివృద్ధి కనిపించింది. ఉత్పత్తి లక్ష్యాలు యిలా అడుగంటిపోతుంటే ధరలు మాత్రం ఆకాశాన్ని దాటిపోయాయి. ఈ ఒక్క ప్రణాళికా కాలంలో అందులోను ముఖ్యంగా 1973-74 సంవత్సరాలలో ధరలు విపరీతంగా పెరిగి ఆర్థిక వ్యవస్థనంతా ఛిన్నాభిన్నం చేశాయి

పై అంశాలను దృష్టిలో పెట్టుకుని ఐదో ప్రణాళికలో ఈ విధానంద్వారా 1000 కోట్ల వనరులు మాత్రమే సేకరించాలని తలపెట్టినా ఈ అంచనా తల్లక్రిందులయే ప్రమాదం లేకపోలేదని గత చరిత్ర తెలియచేస్తున్నది.

ఇంతవరకు మనం లోటుబడ్జెటు విధానం ప్రణాళికల్లో దానికి యివ్వబడిన ప్రాధాన్యత గురించి పరిశీలించాం. కాని యిక్కడ గమనించదగిన విషయం ఈ విధానం ఎంతవరకు సఫలీకృతమైనదనేది. మనం కేవలం ఆర్థికాభివృద్ధికి సాధనంగా మాత్రమే ఉపయోగించినా ఫలితాలు మాత్రం నిరాశాజనకంగా ఉన్నాయి. దీనికి అనేక కారణాలున్నాయి. ఈ విధానంద్వారా పొదుపును అభివృద్ధిపరచి, వాస్తవిక మూలధనాన్ని పెంపొందింప చేయాలని, ఆర్థిక వ్యవస్థలోని సంభావ్యమైన పొదుపును సమీకరించటానికి ప్రయత్నించినప్పటికి ఆశించిన ఫలితాలు పొందలేకపోయాం. ఈ విధానంవల్ల ద్రవ్యం సప్లయి విపరీతంగా పెరిగిపోయింది. ద్రవ్య సప్లయి కనుగుణంగా వస్తూత్పత్తి జరగకపోవటంతో ధరలు అదుపు లేకుండా పెరిగిపోగాయి. దీనికితోడు బ్యాంకులు విరివిగా అప్పులివ్వటంతో స్పెక్యులేషన్ పెరిగిపోయి. కృత్రిమమైన కొరతలను సృష్టించి వ్యాపారులు ధరలను విపరీతంగా పెంచుతున్నారు. పోతే దీనిద్వారా కల్పించిన మూలధనం, మిగులు శ్రమను ఉపయోగించుకోవడానికి సరిపోలేదని చెప్పవచ్చును. ఈ విధానంద్వారా పెరిగిన వాస్తవిక మూలధనం, మిగులుశ్రమను ఉపయోగించుకోవలెనన్న మన పరిశ్రమలో శ్రమ సాంద్రత తక్కువగా ఉండాలి. మరియు పరిశ్రమలు త్వరితగతిని ఉత్పత్తి మొదలుపెట్టేలా ఉండాలి. కాని దురదృష్టవశాత్తు మన దేశంలో లోటు ద్రవ్యం ద్వారా సమీకరించిన వనరులన్నీ చాలావరకు హెచ్చు ఫలన కాలము (Long gestation period) కలిగిన ప్రాజెక్టులలో పెట్టుబడి పెట్టుట వలన ఈ విధానం మిగులు శ్రమను ఉపయోగించుకోవటానికి తోడ్పడలేదని చెప్పవచ్చును. పైగా ముందు చెప్పినట్లుగా ఈ విధానం ద్వారా ద్రవ్యం సప్లయి హెచ్చి, ధరలు పెరిగి ద్రవ్యోల్బణము కలిగిన కారణంగా ఏటువంటి పొదుపును కల్పించటానికి ఈ విధానం దోహదం చేయలేకపోయింది. రిజర్వు బ్యాంకువారు యిటీవల జరిపిన ఒక సర్వే ననుసరించి ద్రవ్యోల్బణం కారణంగా కుటుంబరంగంలో పొదుపు తగినట్లు తెలుస్తుంది. కాబట్టి అదనపు వాస్తవిక పొదుపును కల్పించటంలో కూడా లోటు ద్రవ్యవిధానం మన దేశంలో విజయవంతం కాలేదని చెప్పవచ్చును.

పై విషయాలన్నింటిని దృష్టిలో పెట్టుకుని లోటు ద్రవ్య విధానం ఎటువంటి స్థితిలో మన దేశ ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతుందనే అంశాన్ని గమనించవలసిన అవసరం ఏంతేని కలదు. కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు మన దేశంలో లోటు ద్రవ్య నిధానం మితిమీరిపోయిందంటే మరి కొందఱు అవసరానికి తగినట్లుగా ఉందని వాదిస్తున్నారు. కాని దీనికి ఖచ్చితమైన పరిమితిని నిర్ణయించటం చాలా కష్టమైన పని. దీనిమీదే అత్యంత భారం మోపకుండా తగిన మాత్రంగా ఉపయోగించుకుని ద్రవ్యోల్బణం కలగకుండా చూచుకోవటం సమంజసంగా ఉంటుంది. ప్రజలలో ఉన్న అదనపు ఆదాయాలను బలవంతంగానైనా పొదుపు చేయించగలిగితే యింకా ఎక్కువ లోటుద్రవ్య విధానాని అనుసరించటమే కాకుండా దానివలన సత్ఫలితాలను పొందగలుగుతాం. ప్రభుత్వంవారు సరియైన ధరలు వేతనాల పరిస్థితిని అవలంబిస్తే ద్రవ్యోల్బణాన్ని అరికట్టి కలిగి దీనివలన కలిగే దుష్ఫలితాలను నివారించవచ్చును. మనదేశంలో యింతవరకు ఈ విధానాన్ని ఒక నిశ్చేష్టిత సాధనంగా (passive instrument)గా మాత్రమే ఉపయోగిస్తున్నారు. అట్లా కాకుండా ఈ పద్ధతిని ఆర్థికాభివృద్ధికి ఒక చేష్టిత సాధనంగా (active instrument) రూపొందించినట్లయితే ద్రవ్యోల్బణము కొంత కలిగినప్పటికి ఆర్థికాభివృద్ధికి చాలావరకు తోడ్పడుతుంది. దీనికి తోడు ప్రణాళికాబద్ధమైన పన్నుల విధానాన్ని అనుసరించినట్లయితే, లోటు ద్రవ్యం ఎక్కువయినపుడు, పన్నులు కూడా ఎక్కువయ్యేలా పన్నుల విధానాన్ని సవరించినట్లయితే ద్రవ్యోల్బణం కలిగే అవకాశాలు చాలా వరకు తగి పోతాయి. అందుకు భిన్నంగా ఈ విధానాన్ని భారీఎత్తున అనుసరిస్తూ పన్నులను అదేపనిగా పెంచుకుంటూపోతే ఆర్థిక వ్యవస్థ యింకా దెబ్బతింటుంది. ఈ లోటు ద్రవ్య విధానమనేది నిప్పువలె మంచి సేవకుడిగా ఉపయోగపడుతుంది కాని చాలా చెడ్డ యజమాని అనే అంశాన్ని ఎల్లవేళలా గుర్తుంచుకోవాలి. అప్పుడే ఈ విధానంద్వారా ఆశించిన ఫలితాలు పొందగలుగుతాం.

---

# గాలిపటాలు

'మోహన్'

గాలిలో పటాలు
గాలి పటాలు
ఎగురు తున్నాయి
పై పైకి
పచ్చిక బయళ్ళ మీదుగా
పచ్చని తోటల మీదుగా
పెద్ద పెద్ద మేడల మీదుగా
కొండల మీదుగా
కోనల మీదుగా
అంతులేని ఆకాశం
స్వంతం చేసికొని
విచ్చలవిడిగా
విహరిస్తున్నాయి
పడగలెత్తుకు
విలాసంగా
నాట్యం చేస్తున్నాయి
వినోదంగా
గానం చేస్తున్నాయి
గంధర్వుల మరిపిస్తున్నాయి
చీకటి దొంతర్లను
చీల్చుకొని
అంతస్థులలో
అతుక్కుపోయి
మమతలుడిగిన
మర మనస్సులకు దూరంగా
ఈర్ష్య, అసూయలకు
ఆకలి రోగాలకు
ఆశా నిరాశలకు
చావు బ్రతుకులకు
దూరంగా బహు దూరంగా
పారిపోదామని
తపిస్తున్నాయి
తపన పడుతున్నాయి
తపస్సు చేస్తున్నాయి
కాని
తమ జీవనాడులు
పట్టుకొని
ఎవరో
లాగేసు న్నారు
క్రిందకు
అంతులేని
అగాధాలలోకి

---

# అమరావతి స్తూపము నేటి పురావస్తు పరిశోధనలు

శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

ఆంధ్రమున ప్రాచీన కళలకు సంస్కృతికి నిలయమైనవి గుంటూరుజిల్లాలోని అమరావతి– ధరణికోటలు. దక్షిణ భారతమున నీ స్థలములు చారిత్రక పురాతత్వ పరిశోధనలకు మాతృకగా నున్నవి. మొట్టమొదట 1797 లో, అమరావతిని కల్నల్ కాలన్ మేకంజీ దర్శించి స్తూప ప్రాముఖ్యమును శిల్పములను ప్రపంచమున కెరింగించినాడు. అప్పటికే యమరావతిని జమీందారీ పట ణముగా మార్చుకొన్న రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు స్తూప పునాదులను, చుట్టుప్రక్కల ఇటుకలను పెకలించి, శిల్పము లను ముగు చేసియో, లేక కటు బడులలో రాల క్రింద వాడుకొను టయో జరిగెను. స్తూప ప్రదేశ మొక పెద్ద గొయ్యిగా నుండెనని 1881 లో చూచిన బర్జెసుదొర చెప్పినాడు. ఈతడు అమరావతి స్తూపమును, శిల్పముల యాధారములను, యూహించి చక్కటి చిత్రములు గావించి ప్రచురించెను.

ఆనాటినుండి పలువురు పురాతత్వజ్ఞులు, కళారాధకులు— ముఖ్యంగా ఎలియట్ (1845), సీవెల్ (1876), బర్జెస్ (1881) అలెగ్జాండర్‌రీ (1905-06, 1908-09), ఇటీవల డాక్టరు రావిప్రోలు సుబ్రహ్మణ్యంగారు (1958-59); ప్రత్యేకములు సాగించి అమరావతి స్తూపవాస్తు – శిల్పచరిత్రను ప్రచురించి యున్నారు.

## 2. ధనకటకము[1] :

### అ మ రా వ తి

ఈ స్తూపము అమరావతి గ్రామమునకు పడమరనుండుటచే అమరావతి స్తూపమని ఖ్యాతిబడసినది. కాని శాసనములలో, బౌద్ధ వాఙ్మయములో నీచోటు, ధమ కడ, ధనకడ (ట), మరికొన్నచోట్ల 'ధనకడ' (ట) యని పిలువబడినది కోటకేతరాజు శాసనమున (క్రీ॥శ॥ 1182), యీ పట ణము 'శ్రీ ధాన్యకటకపురము'గా చెప్ప బడినది. ఈప్రదేశము రెండు వేరువేరు గ్రామములై యెప్పటినుండి వాడుకలోనికివచ్చెనోతెలిసికొనుటమంచిది ఎత్తైన కోటగోడలుండుటచే కాబోలు నీగ్రామము ధరణికోటగా వాడుకలోకి వచ్చినట్లున్నది. రెడ్డిరాజుల కాలమునుండి, (క్రీ॥ శ॥ 14 వ శతాబ్ది), ఈ పేరుతో నీ గ్రామము, అమరావతినుండి వేరుగా పిలువబడుచుండెను. ప్రాచీన కాలమున వ్యాపార కేంద్రముగ ప్రపంచఖ్యాతిబడసి, స్వదేశమునందే కాక, వివిధదేశములతో ముఖ్యముగ సింహళము, రోములతో నెక్కువ సంబంధము కలిగియుండెను. క్రీ॥ పూ॥ 3–4 శతాబ్దుల నుండి రేవుపట్టణముగానుండినటుల ధరణికోట ప్రత్యేకములవలన విదితమైనది.[2] ఓడరేవు వ్యాపార సరళికి వీలుగా నుండునటుల కొన్ని ఆర్థిక గోష్ఠులు, శ్రేణులు ధాన్యకటకమునందుండినట్లు, శాసనముల వలన తెలియుచున్నది.

ఈ ధరణికోటకు, 2–కిలోమీటర్ల తూర్పుగా కృష్ణానది యొడ్డుననే అమరేశ్వరాలయముండుటచే నీగ్రామము 'అమరావతి'గా వాడుకలోనికి వచ్చెను. మహాపవిత్రస్థానములైన శైవపంచారామము లలో నొకటియైనది. 'ఆరామ' మన బౌద్ధ ఆరామమే!—చూపా రామములు, అమరావతిలో నుండుటవలన తరువాతి కాలమున శైవము ప్రబలి బౌద్ధమును మరుగుచేసినను – క్షేత్రనామము అమరారామముగానుండిపోయెను. ఇంకొక-విశేషమేమన అమరావతి లోని మహాచైత్యము అత్యున్నతముగా, వానాచి తవిని తమై నిలసిల్లు చున్నట్లు క్రీ॥ శ॥ 1182 వరకున్న శాసనమువలన తెలియుచున్నది.

దీపాల దిన్నెగా క్రీ॥ శ॥ 18వ శతాబ్ది వరకు కూడా వెలుగొందు చుండెను.

## 3. పురావస్తు, చారిత్రక, వాఙ్మయ విశేషములు :

పైన పేర్కొన్నటుల స్తూపము పలుమారు త్రవ్వబడుటచే పెక్కు పురావస్తు అవశేషములు లభించినవి. వీటియాధారమున మహాస్తూపము సుమారు 54 మీటర్లు పరిధికలిగి, 31 మీటర్ల యెత్తులో నలుదిక్కుల తోరణాలంకృతమైన సింహద్వారములుండి నటుల తెలియుచున్నది. వేదికకు ప్రాకారమునకు మధ్య 4 మీటర్ల వెడల్పున చుట్టును శ్రీవీధి (ప్రదక్షిణపథము), యుండినది. ఈ యాకృతి పేరు పెంపులు క్రీస్త్వబ్దము సాతవాహనుల కాలమునాటి దిగా తెలుచున్నది. క్రీ॥ పూర్వమునాటి స్తూపాకృతి యెట్టిదో? యెప్పుడు నిర్మితమయినదో? అప్పటి యేలిక లేక రాజపోషకు లెవరో? ఆంధ్రదేశమున బౌద్ధ మెప్పుడు వచ్చెనో? మున్నగు ప్రశ్నలు సమస్యలుగనే మిగిలియుండెను. భారత పురావస్తుశాఖ ఆగ్నేయవిభాగము తరఫున 1974-75 లో నేను[3] స్తూపపరిసర ములలో మరల త్రవ్వకములు చేసితిని. ఈ వ్యాసోద్దేశమీ పరిశోధనలగూర్చి వివరించుటయే.

ముందుగా పైని వివరించిన సమస్యలుత్పన్నమగుటకు తోడ్పడిన యాధారములనుగూర్చి నిశితముగా పునఃపరిశీలన చేయుట యవసరమని తోచుచున్నది.

బౌద్ధ వాఙ్మయమును చూచిన భగవానుని శారీరక స్తూపము లెనిమిదింటిలో అశోకచక్రవర్తి యేడింటిని తెరపించి యందలి ధాతువులను పెక్కులుగా విభజించెనని ప్రతీతి. మంజుశ్రీ మూల కల్పమను గ్రంథమువలన యీ స్తూపము బుద్ధభగవానుని ధాతువు పైనే, నిర్మితమైనదని తెలియుచున్నది. "శ్రీ ధాన్యకటక చైత్యే జిన ధాతుధరే భువి" అశోక ప్రేషితుడై యాంధ్రమునకు మహాదేవ భిక్షువువచ్చి, చైత్యక పథమును స్థాపించెను. ఈ పథమునకు పటు కొమ్మగా ధనకటకము ప్రసిద్ధి చెందినది. అమరావతి స్తూపము "చేతికి యానం నికాయస మహా చెతియ" (చైత్య నికాయము యొక్క మహాచైత్యము), యని శాసనములద్వారా కూడా తెలియు చున్నది.[4] నవధర్మ కృతులలో నొకటైన "గండవ్యూహ"మను బౌద్ధ గ్రంథమునందు ధాన్యాకరము (ధనకటకము), నకు పూర్వ దిశయందు "విచిత్ర మూల ధ్వజ" పేర ప్రసిద్ధి చెందిన యొక మహారణ్యము కలదని చెప్పబడినది. ఇది యమరావతికి యుత్తరముగా నదీ తీరమున వైకుంఠ పురమునకు చేరువగానున్న కొండ ప్రాంతము. అచ్చట పరిశీలించగా పాచిన ఆవశేషములతో నిండియున్న పెక్కు ఉన్నత ప్రదేశములు కనుపించినవి.

మన యిప్పటి ఆంధ్ర కర్ణాటకములు పూర్తిగా చక్రవర్తి యగు యశోకుని కాలమునాటికి మౌర్యసామ్రాజ్యాంతర్గత క్షేత్రము లుగా నుండిన వనుటలో సందియములేదు. కర్నూలు జిల్లాలోని సువర్ణగిరి, (జొన్నగిరి గ్రామము), యీ సీమకు రాజప్రముఖుని స్థానముగా నుండెడిది. మరొక విశేష మేమన అశోకుడు ధర్మ బోధ నకై తానే స్వయముగా ఈ చోట్లన్నియు దర్శించెనని కూడా కొంత యాధారముకలదు. ఇది సత్యదూరము కాకపోవచ్చును! కర్నూలు జిల్లాలోనే గల మరియొక కుగ్రామమున యశోకుని శాసనపు బండ గలదు. ఈ చోటు పేరు "రాజుల మందగిరి". ఈ పేరులో నిమిడి యున్న దొక మహత్తర చారిత్రక ఘట్టము. ఈ కొండ పరిసరముల యశోక చక్రవర్తి దక్షిణదేశపు రాజుల నందఱిని పిలిపించి తాను దేశించిన ధర్మమార్గమును చర్చించియుండుటనుబట్టి యీచోటు "రాజులమంద' గిరి యని ఖ్యాతి కెక్కినదని నా యభిమతము.

ఇక యశోకుని ధర్మస్తంభములు తన సామ్రాజ్యమున నున్న ముఖ్య నగర కూడలిలో, లేక బుద్ధుని జీవితమున లేదా బౌద్ధ ధర్మమున కాలవాలమై ఖ్యాతి బడసిన చోట నే స్థాపించి[5] నాడు. ఈ శిలాస్తంభములు పెక్కులు కేవలము ధర్మవిజయమును చాటు "ధమ్మథంభాని"గా నుండినవి వానిపై శాసనములు తరువాత గావింపబడెనను వాదము సహేతుకమైనది.

## 4. అశోకుని అమరావతి శిలాస్తంభ శాసనము, మరికొన్ని ముఖ్యావశేషములు :

శ్రీ రావిప్రోలు సుబ్రహ్మణ్యంగారి పరిశోధనలలో ప్రథమము లైన శిల్పశిలా శాసనాదులమూల్యములు. అశోకుని శిలా స్తంభ శాసన భాగము చాల ముఖ్యమైనది. ఇదిపర. మౌర్య కాల

బ్రాహ్మీ లిపిగల శాసనములు, కొన్ని శిల్పశిలలు దొరికినవి. వీనిని రామేశ్వర ప్రసాదుచౌదాగారు, అంతకుముందు బర్జెస్ దొర[6] ప్రచురించియున్నారు. శ్రీ డి. సి. సర్కారుగారు ఇటీవల నీ అశోకుని శాసన భాగమును గూర్చి వివరించియున్నారు.[7] శాసనమున్న



పటము – I అశోకుని శాసనస్తంభ భాగము

అవశేషము 22.5 సెం. మీ. పొడవు, 43 సెం. మీ. యెత్తు కలిగి యుండి యేడు పంక్తుల యక్షరములు కలిగియున్నది. అశోకుని యితర స్తంభములవలె ఇది చూనారు (బీహారు) రాతి గనులలో చెక్కింపబడలేదు, దగ్గరలోనున్న నలమల కొండలలో లభ్యమగు నీసుకరాయి స్తంభము. మౌర్యకాల స్తంభములకు దీటైన శోభాయమానమైన నునుపుదనము చేయబడెను. శాసన లిపి బ్రాహ్మీ, భాష–ప్రాకృతము, అక్షర శైలి యశోకుని శాసనములను బోలియున్నది. ముఖ్యముగ గిర్నారు సౌరాష్ట్రమునందున్న బండరాతి శాసనముల కత్యంత సాన్నిహిత్యము గల్గియున్నది. (పటము - I)

వరుస–1 : ......పరా (ర్) త, అభి (ప)......పరార్థ అభిసిత= పరలోకమున కోరబడిన

వరుస–2 : ......ఖోలి ఖితె (మ +) అ......
పూర్తిగా ఇదఖోలిఖితెమె అనియుండును. ఇహ ఖలు లిఖితం మయా= ఇది నాచే స్వయముగా లిఖించబడినది.

వరుస–3 : ......జనోబహూని......అనగా జనో బహూని. సకల జనానికి.

వరుస–4 : అనుసుయంలి స...అనగా అను శ్రూయతే తత్ మయా=

వరుస–5 : ......రచ్ఛిజితవిజయె ...... ఛిద్యతేవిజయః ఛేదింప బడిన విజయము.

వరుస–6 : ......రమమెపి......అపిచ మమాపి (అ తర్వాత) మరల నేను కూడ.

వరుస–7 : శిథిలమైనది.

ఈ శాసనమును బట్టి యశోకుని కాలమునాటికే మహాస్తూపముండి దాని పూర్వ ద్వారమున నీ స్తంభము ప్రతిష్ఠింప బడి యుండెను. అశోకు డీ స్తంభముపై శాసనము కూడ గావించెను. పూర్తిగా శాసన స్తంభము లభించకపోవుట తీరని దురదృష్టము.

ఇట్లే యిదివరలో లభ్యమయిన మౌర్యకాల లిపిలోడి స్తూపరేఖా చిత్రము కలిగిన 'సూచీ పటము. (పటము–II) దీనిని బట్టి యప్పటి శిలాప్రాకారమునకు సంబంధించిన పలుపు బండ రాయి [granite], నిలువు స్తంభములపైనున్న శాసనములబట్టి యు అశోకుని కాలమునాటికే యీ స్తూపము పూర్తిగా నిర్మించబడినట్లు చుట్టును శిలాప్రాకారమును గల్గి యుండెనని తెలియుచున్నది.

ఈ యవశేషములేగాక యిదే కాలమునకు చెందిన మరియొక

శిల్పస్తంభము (పలుపలకలది) (పటము III) చాల ముఖ్యమైనది. ప్రతి ఫలకముపైని బౌద్ధారామములు, వాటి పేర్లతోసహా బుద్ధ భగవానుని జీవిత గాథను కన్నుల పండువుగా చెక్కియున్నారు. ఇటువంటి శిల్ప-శిలాశాసన స్తంభము దేశమున మరెక్కడను కానరాదు ప్రతివైపున పైభాగము శిథిలమైనది. (పటము III) పూర్తి చిత్ర వివరములు తెలియుటలేదు. ఉన్నంతలో శిల్పశైలి, కథా విధానపటిమ చూపరుల నాకట్టి వేయుచున్నదనుటలో సందేహములేదు. (పటము III, IV ప్రక్క పుటలో)

మొదటివైపు చిత్రము : శిథిలమైపోయినది.

బహుశః బుద్ధుని జననము : అభినిష్క్రమణము. ధర్మ బోధనము చూపునటు ఉండునేమో !

రెండవవైపు చిత్రము : (పటము IV) పైభాగము శిథిలమైనది. శాసనము ఎడమవైపు అంచునానుకొని పైనుంచి క్రిందికి వ్రాయబడినది—ధమ్మకడవ్ వంస్ననామ గోఠిచ ధాన్యకటకములోని వస్రనామ గోష్ఠి : చిత్రములో ముఖ్యముగ గమనింపదగినది కృష్ణానది చూర్పునకు మరలి ప్రవహించుట, యిప్పుడున్నటులే యుండుట విశేషింపదగినది. ఈ శిల్పమున చూసిన కట్టడములు— చైత్యము, ఆరామములు, అలంకృతములైన తోరణాద్వారము లోడి యంత్రస్తం మేడలు. అన్నిటి అమరావతి-ధరణి కోట లెంతటి శోభాయమానములుగానుండెడివో చెప్పక చెప్పుచున్నవి.

మూడవవైపు చిత్రము : క్రిందనుంచి పైకి : శ్రావస్తి జేతవన అనాథపిండికన ఆరామో.



పటము - II స్తూపాకృతినిమూవు సూచీపటము;కాలము-1శ. శాసనము : కొరముచికన నేలజరభన



పటము— III శిల్ప శాసనములుగల
నలుపలకల స్తంభము : కాలము -1 శ.

ఇచట శ్రావస్తి మరియు జేతవనములోని అనంత పిండిక ఆరామము కలదు. వైశ్యశ్రేష్ఠుడు అనంత పిండిక రాజా జేతనుండి వనమును కొనుగోలు చేయుట చూపబడినది.

నాలుగవవైపు చిత్రము : (పటము— V) అతిముఖ్యమైనది. క్రిందనుంచిపైకి శిల్పకళతో కూడిన చిత్రములు శాసన సహితముగ ఆరు స్థూపముల విశేషణములను చూపుచిన్నవి. చిత్రమేమన ఈ వైపు బుద్ధుని జీవితములోని చివరి మూడు నెలల విశేషములను వైశాలి నగరము మొదలు మరో పరి నిర్వాణస్థలమైన కుశి నగరము వరకు చూపడమయినది.

(1) వైశాలిలోని బహుపుత్రిక చైత్యము. బహుపుత్త— చేతియ నేనలికాని చేతియాని' ఈ ప్రదేశము బుద్ధ భగవానుని కెంతో ప్రీతికరమైన వసతి స్థానము.

(2) చాపాల చేతియే
మారోయచతే ఓస
వతు......హంగాయచ
చూలి......వటో.



పటము— IV పై శాసన శిల్ప స్తంభముయొక్క రెండవ పక్క
కాలము—1 శ.

చాపాల చైత్యము. ఇచ్చట బుద్ధభగవానుడు పలుమార్లు వసించిన ప్రీతికరమైనచోటు.

(3) వేసాలీయ విహారాది మహావనే కూడా (గ) రసాలాయ.
వైశాలిలోని బుద్ధుని ఏకాంత వాసము—మహావనములోని కూటాగార శాల. (వర శాల)

(4) నాగ అపలోగన : బుద్ధుడు వైశాలీనగరమును విడిచి పోవుచు, వెనుదిరిగి ఒకసారి 'వెల్లయేనుగు' రూపమున పరామర్శించెనట.

(5) విరిగియుండుటవలన పూర్తిగా చెప్పజాలము గాని వైశాలినుండి కుశినగరముపోవు మార్గమును చూపుచున్నది.

(6) సాలవనములో (కుశినగర), బుద్ధుని మహాపరి నిర్వాణమును చూపు చిత్రము.

ఈ శిల్పరాజమును నిశితముగా పరిశీలించినచో ధమ్మకడము గూడ బుద్ధుని జీవితకాలములోనే దక్షిణమున గొప్ప ధర్మక్షేత్రముగా వెలసెనని చెప్పుట కనువుగా తోచును. మిగతచోటలెట్లు బుద్ధునికి సన్నిహితములుండెనో ధనకటకము కూడనటే యని యీ శిల్ప స్తంభము చాటుచున్నది. లుంబిని సారనాథ్, వైశాలి, శ్రావస్తి, రాజగృహము, కుశినగరములెట్లు బుద్ధునికి ప్రీతిపాత్రములై పలుమార్లు భగవానునికి, వాసయోగ్యములైనవో, వీని మధ్యలో చూపబడిన ధమ్మకడమునకుగూడ బుద్ధుడు విచ్చేసి పావనముజేసెనేమో! ఈ విశేషమువలననే కాబోలు చక్రవర్తి అశోకుడు ధరణికోటలో స్తూపమునద్ధరింపజేసెను. ధర్మస్తంభమును నాటించి, ధమ్మశాసనము చెక్కించెను. ఆంధ్రమున బౌద్ధమశోకునికి పూర్వమునసే యుండెనని నిస్సంశయముగా తెలుచున్నది. శ్రీ కె. ఆర్. సుబ్రహ్మణ్యము గారు,[8] 1932 లోనే ఆంధ్రమున బౌద్ధము అశోకుని పూర్వమునసే యుండెనని యూహించినారుకాని బుద్ధుడు స్వయముగా ఆంధ్రప్రాంతమును దర్శించియుండెనను గాథ సత్యదూరమని చెప్పినారు. ఈ విషయము మరల నొకసారి పూర్తిగా పరిశీలించవలసినదే. బుద్ధుని జీవితకాలముననే యుత్తర-దక్షిణాపథములు సన్నిహిత బాంధవ్యముకలిగి యుండెడివి. కోసలాధిపతి పురోహితుడైన బావరి బౌద్ధమును స్వీకరించి దక్షిణాపథములోని అస్సక ప్రాంతమున, గోదావరినది చేరువగా ఆశ్రమమును స్థాపించినటుల 'బుద్ధచరితము' లో నున్నది. (**Buddha Charita, xxi**). ఈ బౌద్ధబావరి తన శిష్యుల పదునారుగురిని బుద్ధునిచెంతకు పంపియుండెను. వీరు పోయిన మార్గము, 'సుత్తనిపాత' యను గ్రంథమున వివరించియున్నది. వారు బుద్ధుని 'రాజగృహ'మున కలిసిరి.[9] అమరావతిలో



పటము— V శిల్ప శాసన స్తంభము—నాల్గవ ప్రక్క; కాలము 1—ఆ

లభ్యములైన క్రీ॥ పూ॥ శాసనములలో, ఆకాలమున వర్ధిల్లుచున్న వ్యాపారగోష్ఠులు, నిగమములు, కొన్ని రాజగృహ, పాటలీపుత్రముల నుండి వచ్చిన వ్యాపారసంస్థలుగా పేర్కొనబడియుండుట గమనార్హము.

ధరణికోట-అమరావతి సమీపమున చేలలో యథాతథంగా శాసన-శిల్పములు నాణెములు లభ్యమగుచున్నవి. ముఖ్యముగా మౌర్య కాలమునాటి వెండినాణెములు, సంయుక్త చిహ్నములతో ముద్రింప బడినవి, పెద్ద కుండలో కుదురుగా లభ్యమయినవి. ఈ నాణెములలో కొన్ని పొడుగుపాటివంగిన (long bent bar Series) రకము మౌర్యచంద్రగుప్త-బింబిసారుల కాలమునాటివని శాస్త్రజ్ఞుల యభిమతము. ఒక్క అమరావతి, కృష్ణా-గుంటూరు జిల్లాలలోనేకాక, నిజామాబాదులోని బోధనము కరీంనగరులోని పెద్దబంకూరు, మేదక్ జిలాలోని కొండాపురములలో కూడ లభ్యమయినవి. కేవలమీ రకపు నాణెములు మాత్రమే చిన్నమట్టి పాత్రలో భూగర్భితములుగా దొరకుటనుబట్టి, శ్రీ పరమేశ్వరి లాల్‌గుప్తా[10] గారు ఈ నాణెము లను, మౌర్యచంద్రగుప్తుడు-బింబిసారుని కాలమున దక్షిణాపథ దండయాత్ర జరిగిన సందర్భములో ప్రజలు బీభత్సులై భూగర్భ మున దాచుకొనియుండవచ్చునని యభిప్రాయపడెను. ఇది సత్య దూరముకాదు. అశ్మకము-కళింగము షోడశజనపదములలో చిన్న రాజ్యములుగా ప్రసిద్ధిగనుండెనుకదా!

## 5 నేటి పురావస్తు పరిశోధనలు II

ఇటీవల, అనగా 1974 లో కొనసాగించిన త్రవ్వకములు స్తూపమునకు చేరువగా ఈశాన్యభాగమునయున్న యొక్కైన స్థల మున గావింపబడెను. చిత్రమున (పటము- VI) చూపినటుల మహా స్తూపము నానుకొని తూర్పుభాగమువ అయక పటమునకు సామీప్య మునకూడ త్రవ్వకము చేయబడెను. పైనుండి పునాదుల క్రింది భాగమువరకు, ఇంచు మించు 6 మీటరు (19 అడుగులు);



పటము- VI అమరావతి స్తూప త్రవ్వకములు-1974




పటము— VII : విభాగములకు చెందిన పురావశేషముల, స్తరముల చూపు ఖండిక.

మందము మటి పొరలు జాగత్రగా త్రవ్వి పరిశీలింపబడినవి. ఈ స్తరములలో లభ్యమైన వివిధ పురావస్తు సంపదను, స్తరశాస్త్రరీత్యా కాలనిర యము గావింపబడెను. (పటము VII)

కాలము : 1 క్రీ. పూ 114-3 శతాబ్దులు: యిది రెండుగా విభజింపబడెను.

కాలము 1 అ : ఇది క్రీ॥ పూ. 4వ శతాబ్దికి చెందినది. స్తూప పునాదులకన్న కిందుగా మొట మొదట నివసించి యున్న వారి - చారిత్రకాస్మికలు లభ్యమైనవి. నేల చదును గావించి, కొయ్య స్తంభములపై చిన్న పర్ణశాలలు నిర్మించుకొని వసించుచుండిరి. వీరు గుంటలలో పారవేసిన వస్తు అవశేషములు చాల లభించినవి. ముఖ్యముగా మట్టిపాత్రల యవశేషములు— నలుపు— మరియు ఎరుపు రంగు గలిగినవి, చక్కని నునుపుతో శోభాయమానముగా కన్పడు నలని లేక బంగారు— వెండి ఛాయలతో గాజువలె మెరయుచుండెడి మెరుగైన పాత్రలు దక్షిణ దేశమున నురెక్కడ, విస్తృతముగా, నుండ నటివి లభింపలేదు. ఉత్తరదేశమున ఈ మృణ్మయపాత్రలు 'న్. బి. పి'గా ఖ్యాతి బడసెను. ఈ అవశేషములు షోడశ జనపదము లుగా ప్రసిద్ధి గాంచిన పట్టణములైన, కాశి కోసల, వైశాలి, కౌశాంబి, ఉజ్జయిని, (అవంతి), విదిశ, రాజగృహ, లుంబిని మొదలగుచోట్ల, క్రీ॥ పూ॥ 6వ శతాబ్ది నుండి—2వ శతాబ్ది వరకు వాడుకలో నుండెను. ఈ కాలమున ఇనుప సామగ్రి వాడుకలో నుండెను. గొప్ప పట్టణములు వృద్ధిలోనికి వచ్చినవి. వాణిజ్యము ప్రబలెను బౌద్ధ జైనము లుదయించుటయేగాక వ్యాపారులవల్ల త్వరితముగా దేశమంతట వ్యాప్తిచెంది, పూర్వాచార వైదికమతముపై దెబ్బ వేసెను. అట్టి కాలమునకు చెందిన ఈ మృణ్మయ పాత్రలు స్తూప పునాదులలోను, క్రిందను కూడ లభ్యమగుట చాల ముఖ్యవిశేషము. ధరణికోట ప్రాంతమున త్రవ్వకములలో కూడ అట్టడుగున మట్టి పొరలలో యీ పాత్రావశేషములు కొలదిగా లభ్యమయినవి. 'కార్బన్—14'[12] యను కాలనిర్ణయ పద్ధతి (శతారం, టాటా ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసర్చ్, బొంబాయి వారు ఈస్తరములు క్రీ॥ పూ॥ 4వ శతాబ్దినిగా తెల్పినారు.





పటము VII A మృణ్మయావశేషములు : కాలము — 1 అ.

నలుపు— మరియు— ఎరుపు కోవకు చెందిన మట్టి పాత్రలపై అసంపూర్ణమైన పేరు బ్రాహ్మీ లిపిలో వ్రాసియున్నవి. 'నాలస' '..... తిసపాత (పటము VII A) యని చదువవగును. ఈ పేరు బౌద్ధ భిక్షువులని చెప్పవచ్చును ఈ లిపి కూడ చాల ప్రాచీనమైనది. అశోకుని పూర్వమునకు చెందినట్టి స్తరములలో

లభ్యమగుటవలన ఈ పీఠికలు కూడ నట్టివే. ఈ కాలమున స్తూపము నిర్మితమై యుండెననుటకు కెట్టి యాధారములు లభ్యము కాలేదు. ఈ కాలమునకు చెందిన కట్టడములు మరెక్కడైన నుండి యుండవచ్చునేమో! అటివి మహాస్తూప సమీపమున కాకున్న దూరముగా నుండుట కవకాశమున్నది. ఇంకను పెద్ద పెట్టున వస్తుశాస్త్రీయ త్రవ్వకములు చేసి పరిశీలించిన గాని నిర్ణయము కాజాలదు. ప్రకృతములో తేలినదేమన యాంధ్రమున బౌద్ధ మశోకుని పూర్వము ననే ప్రచారములో నుండినది. అమరావతి ధరణికోటలు ముఖ్యమై చారిత్రక-వ్యాపార బౌద్ధమత కేంద్రములుగ అప్పటికే ఖ్యాతి బడసినవి.

కాలము—1 ఆ! క్రీ॥ పూ॥ 3వ శతాబ్ది. ఈ కాలమున మహాస్తూపమున్నటు తెలియుచున్నది. పై నుదాహరించిన పున్నమ్మయు పీఠలేగాక యశోకుని కాలమునాటి శాసనములు కల్గిన ప్రాకార శిలాస్తంభములు స్తూప తూర్పు-పడమరల ముఖ ప్రవేశ ద్వారముల కిరువైపుల లభ్యమైనవి ఇవి గ్రానైట్ రాతిస్తంభములు.



పటము- VIII A. అశోకుని కాలము (1-ఆ) నాటి బండరాయి విఱువు కంభము ;

వీని పూర్తి యెత్తు భూమిపై 2 3 మీటరు గలిగియుండి, 1 మీటరు వెడల్పుతో, ప్రక్కన అడ్డుకమ్ములను జొనుపుట కనువైన



B. దానిపై శాసనము —కాలవైరగామసథభో

నేత్రాకారపు గుంటలు గలిగియున్నవి. వానిపై శాసనములు అశోకుని కాలపు లిపిలో వ్రాయబడినవి. (పటము- VIII A,B,C.) అశోకుని శిలాస్తంభములపై నేటి శోభాయమానమైన నునుపుదన మున్నదో



C. మరొక స్తంభము పైని శాసనము :
కుమారస అవతకమసథభో: మాఘవదలేనామకరా (కరాపితో) :

అట్టి యీ గ్రానైట్ శిలాస్తంభములు చాల పెదవి, బరువైనవి యైనను, మెరుపుదనము గలిగియున్నవి. ఈ కోవకే చెందిన ఒక పెద్ద శిల్పము-యక్షుని విగ్రహము- అతి ముఖ్యమైనది. స్తూప ప్రదేశమున నెప్పుడు, నెట్లు లభించెనో తెలియదు. మ్యూజియంలోని అంతర్గతంగా నున్న కొన్ని శిల్ప సముదాయంలో దీనిని చూచుట జరిగింది. ఈ ప్రతిమ చాలవరకు శిధిలావస్థలో నున్నది. అశోకుని కాలమునకు చెందిన పెద్ద యక్ష—కుబేర ప్రతిమల కోవకు చెందినది.

ఈ కాలమునకు చెందిన స్తంభములలో లభ్యమయిన మరి కొన్ని శాసనములు దాచేపల్లి సున్నపురాయి 'సూచీ' పటములపై నున్నవి. వీనినిబట్టి, యిదివరలో లభ్యమైన కొన్ని 'ప్రాచీన

సూచీలను సమన్వయ పరచి పరిశీలించగా (వాటి కొలతలు. మందము, పొడవు, ఎత్తులు), మొట్టమొదటి శిలాప్రాకారము, గ్రానైట్ స్తంభములతో తూర్పు--పడమరల ద్వారముల కిరువైపుల కొంత వరకు మాత్రమే యుండినట్లును, సున్నపురాయి సూచీ పటము - ఉష్ణీషము గలిగినట్లు తెలియుచున్నది. ఈ కాలమున స్తూపముపై నెక్కువగా శిల్పమున్నట్లు కనబడదు. స్తూపాకృతి బహుశః పైని చూపిన ఛాయాచిత్రము గల సూచీపటములోవలె నుండెను. దీనిపై నశోకుని కాలమునాటి శాసనము కూడ కలదు.

కాలము 2 : క్రీ॥ పూ॥ 1–2వ శతాబ్ది !

అశోకుని కాలకృతమైన మహాస్తూప మీ కాలమున అత్యంత శోభాయమానమైనది. శిల్పములతో వలరారెను. అసంపూర్ణమైన శిలా ప్రాకారము పూర్తిచేయబడెను. బండరాయి స్తంభ



పటము— IX [illegible]మూర్తి. కాలము–2 ;



పటము— X ప్రాకార స్తంభముపై యేనుగు శిల్పము : కాలము–2.

ములు లేనిచోట్ల సున్నపురాయి స్తంభములు పూరింపబడెను. వీనిపై చక్కని శిల్పములు గూడ నుండెను. మొట్టమొదటగా స్తూపము చుట్టును ప్రదక్షిణమునకు వగు శ్రీవీథి యేర్పడినది సూచీ పటములపైని కూడ శిల్పము చెక్కబడెను ముఖ్యద్వారస్తంభములపైని, ఆయక పటముపైని కొన్ని చక్కని శిల్పములుండెను. ముఖ్యముగ నొక యక్షిణి ప్రతిమ (పటము IX), ఆ కాలమునకే చెందిన బార్హుత్, సాంచీ స్తూపములతో లభ్యమైన దాని కేమాత్రము తీసి పోదు. అమరావతి శిల్పశైలికి మాతృక-గట్టి పునాది ఈ కాలమునందే వేయబడినదని నిర్ధారణగా చెప్పనగును. సొగసుతో భావ స్ఫూర్తిమంతమై విలక్షణమైన ముఖకవళికతో, అనాటి యాంధ్రుల యాడుబిడ్డలకు ప్రతీకలుగా నిల్చియున్నవి. ముఖ్యముగ తలకొప్పు, వస్త్రధారణ, నగలతీరు, వడ్డాణమును బోలిన మేఖలాబంధము చూడ ముచ్చటగ మనయాంధ్రత్వమును చాటుచున్నవి శిల్పములు ఇట్టి శిల్పరాజములే అమరావతికి ప్రపంచములోని శిల్పపీఠములలో అగ్రతాంబూల మిచ్చినవి. ఇటీవల లభ్యమైన మరొక ప్రాకార కంభముపైని చెక్కియున్న యేనుగు చిత్రము (పటము X) తాటిచెట్టు క్రింద పెరుగుచున్న [illegible]నది. ఇది 'కాల్పి (ఉత్తర ప్రదేశ్) లోని రాతిపైని

గల 'గజతమ' (బుద్ధ భగవానుని రూపము)ను బోలియుండుట విశేషము.

ఈకాలమున మౌర్యకాలమునాటి వెండినాణెములు, మృణ్మయ పాత్రలు పెక్కులభించినవి. ఈ ప్రదేశమును పాలించినరాజు లెవరో ఇదమిత్థముగా చెప్పజాలకున్నాము. భట్టిప్రోలు శాసనములలో నీ సమయమున 'ఖుబిరకుడు' అను రాజు పాలించుచుండెనట్లు తెలియ వచ్చుచున్నది. కాని ఇటీవల దొరికిన గుంటుపల్లి[13] శాసనము ద్వారా కళింగాధిపతియైన ఖారవేల చక్రవర్తి ఈ సీమ నంతను అధీనము చేసికొని 'మహిషాధిపతి' గా చాటుకొన్నాడు. బహుశః భట్టిప్రోలు ఖుబిరకుడు కూడ నీతనికి సామంతుడయియుండవచ్చును. ఈ ఖార వేలుని రాజ్యాంతర్గతముగా కోస్తా ఆంధ్రప్రాంతమంతయు వశ మగుటవలన శాతవాహన చక్రవర్తులీకాలమున తెలంగాణ ప్రాంతమున-రుపాద్రిష ములును రాజ్యముగావించుచుండిరి.

కాలము—3 ( క్రీస్తుశకము 1 నుంచి 2 వ శతాబ్దివరకు). ఈకాలమున, స్తూపమెన్ని విధములుగానో మార్పుచెంది, చాల నెత్తైన శిలాప్రాకార-సింహద్వారములతో మహత్తరమైన శిఖా ఖండమై విరాజిల్లినది. ఇప్పుడున్న స్తూపాకృతి శాతవాహనకృతమే. ఈ కాలమునాటి శిల్ప-శిలాశాసనములు జగద్విదితములు. పలుగ్రంథ ముల ప్రచురిత[14] మయ్యెను. ఇప్పటి త్రవ్వకములలోగూడ వాం లభించినవి. ముఖ్యముగా తేలినదేమన: అమరావతి – ధరణికోటలు మొట్టమొదట శాతవాహనుల పరిపాలనలోనికి శ్రీ గౌతమీపుత్ర శాతకర్ణి దక్షిణదిగ్విజయముచేసినతర్వాతనే వచ్చెను. శాతవాహన నాణెములు ముఖ్యముగా గౌతమీపుత్రుని పెద్దకుమారుడు, రాజు అయిన శ్రీ వశిష్ఠీపుత్ర పులుమావి ( II) యొసగినవి. ఈకాలము నాటి స్తరములలో లభ్యమైనవి. అంతకుపూర్వము శాతవాహన రాజుల నాణెములుగాని – శాసనములుగాని బొత్తిగా లేకుండుటనుబట్టి మొదటిశాతవాహనరాజు లీప్రాంతమును పాలించలేదని స్పష్టముగా చెప్పవీలగుచున్నది. ఈ నాటి త్రవ్వకములో లభించిన ఒక ఉష్ణీష శిల్పము శాతవాహన కృతికి దీపికవంటిది.

(పటము XI) : కాలము 4 : (క్రీ. శ. 3-6 శతాబ్దులు శాతవాహనుల యనంతరము ఇక్ష్వాకు లీ స్తూపము నాదరించి, వృద్ధిగావించిరి. వీరికాలమునకు చెందిన శిల్పములేగాక. రాగి, సత్తునాణెములుముఖ్యములు.



పటము – XI ప్రాకారోష్ణీష ఫలకము : మిత్తవింద జాతకము.

కాలము 5 : క్రీ. శ. 6—11 వ శతాబ్ది వరకు. అటు తర్వాతకూడ బౌద్ధము మహాస్తూపము ప్రచారములో నుండెను. ఈకాలమున వజ్రయానము ప్రబలినది. ధర్మమును బోధించు 'ధర్మకీర్తనలు' గలిగిన మట్టిబిళ్ళలు–బోధిసత్త్వయు, పద్మపాణి మొదలగు శిల్పములు పెక్కులు లభించినవి.

ఇట్టి త్రవ్వకముల ఫలితముగా కొన్ని నూతన చారిత్రక-పురావస్తు అవశేషములు లభ్యమగుటయేకాక కాలనిర్ణయముచేయుటకు తోడ్పడినవి. మొట్టమొదటగా స్తరశాస్త్రరీతి స్తూపపరిసరములలో త్రవ్వకములు జరిగినవి. ఈస్తరములలో లభ్యమయిన చరిత్రాస్తికలు వివిధకాలములలో స్తూపరూపము, పేరు-పెంపులు, వాస్తు నిర్మాణ రీతులతో సమన్వయించి కాలనిర్ణయము గావింపబడినది. ఇదివరలో

పెక్కు ప్రత్యక్షములలో లభ్యమైన శిల్ప, శిలాశాసన వస్తువులు, మట్టిపాత్రలు, నాణెములు, ఆభరణములు, సిక్కాలు, స్తరశాస్త్రరీత్యా సమన్వయింపబడలేదు. ఇప్పుడు నిర్ణయమైన కాలపట్టిక నాధారముగా యిదివరలో లభ్యమైనట్టి అవశేషములన్నింటిని పునః పరిశీలించవలసిన అవసరమెంతయోకలదు. ఇది బృహత్తర కార్యము. ఏలన అమరావతి స్తూప శిల్పములు, పురావస్తువులు పలుచోట్ల నుండిపోయినవి. స్వదేశమున, మదరాసు, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాదు మ్యూజియములలోను, విదేశములలో, ముఖ్యముగ లండను, జర్మనీలలోను, అమరావతీ శిల్పము, శాసనములు కాలానుగతంగా చేరిపోయినవి. కొన్నింటి వివరములుకూడ లేవు. చివరకు ఆంధ్రరాష్ట్రమున అమరావతిలోని ప్రదర్శనశాలకు దక్కినవి విరిగిపోయిన ముక్కలు మాత్రమే. ఈ ముక్కలుకూడ ప్రపంచమున కళారాధకులందరిని ఆకట్టుకొంటున్నాయి.

గమనిక : ఈ వ్యాసమున చేర్చిన చిత్రపటములు భారత పురావస్తు సర్వేక్షణ, ఆగ్నేయ విభాగమునకు చెందినవి. వ్యాసము, ప్రచురణ కంగీకరించిన, డైరెక్టరు జనరల్ వారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు. వీరి యనుమతి లేనిదే చిత్రపటముల ప్రచురించరాదు.

## అధోజ్ఞాపికలు

1; I, Karthikeya Sarma, "Dhanakataka" in Kannada Encyclopaedia, (Mysore Universit 74) Also Epigraphia India, VI, pp, 146 - 60.

2. Indian Archaeology, A Review, 1962 - 63, pp. 1 2; 1963 - 64, pp. 2 - 3, fig. 1; 1964 - 65, pp. 2 - 3.

3. ఈ పరిశోధనలలో నా సహచరులు, సర్వశ్రీ డా. గోపాలశాస్త్రి, రాజారావు, హనుమంతరావు మరియు వెంకటేశ్వరరావు యెన్నియో విధముల తోడ్పడిరి. ఫొటోగ్రాఫర్లు శ్రీ పాత్రుడు, శ్రీ ఎడ్విన్ చక్కగ చిత్రములు తీసిరి. వీరందరికిని నా కృతజ్ఞతావందనములు.

4. Luder's List, No. 1248, p. 147 : వశిష్ఠీపుత్ర శ్రీ పులుమావి, క్రీ.శ. 1వ శతాబ్ది నాటిది.

5 N P. Chakravarty, in Ar ' nt India, No 4. p.24

6. Epigraphia India, XV, P. 258
Archaeological Survey of South India, Vol. I, (1887), pp 22 23.

7. Epigraphia India, XXXV, pp 41 - 43.

8. K, R. Subrahmanyam, Buddhist Reviews and Early History of Andhra, (1952), pp. 3 - 4.

9. S. Dutt, Buddhist Monks and Monasteries in India, (Oxford, 1962), P. 120.

10. P. L. Gupta, Punch marked coins in the A. P. Govt. Museum, No. 1 (1961), P, 2.

11. I. Karthikeya Sarma, "Some more Inscriptions from Amaravathi Excavations and the Chronology of Maha Stupa", Journal of the Epigraphical Society of India, I, (Mysore, '74) pp.60-74

12. I. Karthikeya Sarma, "C 14 dates, N. B. P. Ware and Early Historical Archaeology of Peninsular India", Journal of Indian History, University of Kerala (April 1974) Vol. L II - Pt. 1, pp. 49-56.

13. R. Subrahmanyam, A. P. Govt. Archaeological Series, No. (Hyderabad, 1968), pp. 1 - 3.

15. ఈ వ్యాసమున యిదివరలో ప్రచురితములైన వ్యాసములలో చర్చించిన విషయముల నిందు, అవశ్యకములని తోచినగాని, చేర్చలేదు. కాన చదువరులు అమరావతినిగూర్చి తెలుగున చదువవలెనన్న ముఖ్యముగా నీక్రింద చూపిన గ్రంథములను చూడనగును.

(a) మల్లంపల్లి సోమశేఖర శర్మ, అమరావతీ స్తూపము, ఇతర వ్యాసములు (మద్రాసు, 1932), pp. I - 34.

(b) వీరిదే ; విజ్ఞాన సర్వస్వము, 3, 'అమరావతి'గా ప్రచురితమయినది.
తెలుగు సంస్కృతి - 2 (మద్రాసు, 1961), పుటలు : 69–70, 716 19.

(c) టి. ఎన్. రామచంద్రన్, అమరావతి స్తూపము, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, ద్వి-య సంపుటి, (చెన్నపురి, 1934) pp, 287 305

# ?

## శ్రీ బి. స్వర్ణాంబ

పుస్తకం చిరిగిపోయింది, భగ్నప్రేమికుని హృదయంలా;
పుటలన్నీ అస్పష్టంగా ఉన్నాయి, అర్థంకాని స్త్రీ హృదయంలా;
మొదటి పేజీ కోసం చూశాను.
అది ఎప్పుడో చిరిగిపోయింది.
ఆఖరి పేజీకై వెదికాను
అంతుపట్టకుండా పోయింది
ఇక పుస్తకం ఎలా చదవటం ?
విషయం ఏ విధంగా అవగాహన చేసికోవటం ?
అయినా, చదవక తప్పడంలేదు.
అర్థంకాని విషయాలెన్నో అందులో ...
అడిగితే సమాధానం రాదు.
అన్నీ ప్రశ్నార్థకాలే ? ? ?
అన్నీ అర్థంకాని ప్రశ్నలే ...
అసలు ఈ పుస్తకం నా చేతి కెవరిచ్చారు చెప్మా ? ? ? ?
అంతుబట్టటం లేదు సుమా ఎంత ఆలోచించినా ! !
చదవడం ఎప్పటికి ముగుస్తుందో తెలీటం లేదు.
భారంగా పుటలు తిరగేస్తున్నాను.
బరువు మోస్తున్న ఎద్దులా నడుస్తున్నాను.
అస్తవ్యస్తంగా ఉన్న పేజీలను సరిదిద్దాలని చూస్తున్నాను.
కానీ అది సాధ్యం కావడంలేదు.
నా తరువాత ఈ పుస్తకం ఎవరికివ్వాలి ?
ఏమో తెలీడంలేదు గానీ ఎవరో సిద్ధంగానే ఉంటారు.
యుగ యుగాలుగా దీనిని చదువుతూనే ఉన్నారు.
అర్థం చేసికోవటానికి యత్నిస్తూనే ఉన్నారు.
ముందూ, వెనకా, ఏమిటో తెలియక పోయినా,
మధ్య విషయం కొంతే తెలుస్తున్నా,
ఎవరో దీన్ని చదవాలని శాసించారు.
అందరిలాగే నేనూ చదువుతాను.
అందని గమ్యం కోసం వెదుకుతాను.

# భారత ప్రజలకు ఒక సవాలు

నేటి పరిస్థితి భారత ప్రజలకు ఒక సవాలు
ఇది ఒక సదవకాశం

సంఘంలోని నిరుపేద వర్గాలు, మధ్యతరగతి ప్రజల ప్రయోజనార్థం ప్రధానమంత్రి ౨౦ — సూత్రాల నూతన ఆర్థిక కార్యక్రమం ప్రకటించారు.

ధరల తగ్గింపు * భూసంస్కరణలు * స్మగ్లర్లు వెం. దలగు స్వార్థపర వర్గాల ఆటకట్టింపు * బలహీన వర్గాల వారికి యిండ్ల స్థలాలు * వ్యవసాయ కూలీల కనీస వేతనాలు * అధికోత్పత్తి * పరిశ్రమల్లో కార్మికుల ప్రాతినిధ్యం......

ఇలాంటి ఎన్నో సమస్యల పరిష్కారానికి జాతీయ స్థాయిలో ఇతోధికంగా కృషి ప్రారంభమైంది.

అందరి బాగుకోసం
దేశ సమగ్రత కోసం
నవ సమాజ స్థాపన కోసం

ప్రధాన మంత్రి ప్రణాళికలను
అందరం కలిసి అమలు పరుద్దాం

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు

No. 23/75

# రా. వి. శాస్త్రి నవలలు - ఒక పరిశీలన

## శ్రీ వల్లంపాటి వెంకట సుబ్బయ్య

బూర్జువా నాగరికత విశ్వసాహిత్యాని కిచ్చిన మహత్తరమైన కానుక నవల. నవల ఆవిర్భావంకంటే దాని పరిణామం మరీ ఆసక్తిదాయకమైంది. బూర్జువా నాగరికత సృష్టించిన నవలను — బూర్జువా నాగరికతనే హేళన చేయటానికి ఆయుధంగా వాడుతున్న రచయిత రా. వి. శాస్త్రి. అతని గొప్పదనం అతడు గతాన్ని అనుకరించకపోవటంలోనూ సమకాలం అతణ్ణి అనుకరించటంలోనూ వున్నదనటానికి సందేహంలేదు.

రావిశాస్త్రి 1952లో తన "అల్పజీవి" రచనలో నవలా రంగంలోనికి ప్రవేశించాడు. ఆనాటికి విశ్వనాథ, ఉన్నవ, గోపీచంద్, బుచ్చిబాబు, కొడవటిగంటి కుటుంబరావు లబ్ధ ప్రతిష్ఠులైన నవలాకారులు. వీరిలో ఎవర్నిగానీ రావిశాస్త్రి తెలిసి అనుకరించిన జాడ కనిపించదు. పైన పేర్కొన్న ఐదుగురు నవలాకారులూ విభిన్నమైన శిల్పమార్గాలున్నవారు. కానీ రావి శాస్త్రి శిల్పమార్గం తెలుగు నవలా చరిత్రలో కొత్తది, విశిష్టమైనది. ఈనాడు రావిశాస్త్రిని అనుకరించే వారికి కొదువలేదు. అందులో కొందఱు ప్రసిద్ధులు కూడా.

రావిశాస్త్రి మొదటినవల అల్పజీవి. భారతిలో ధారావాహికంగా ప్రచురింపబడింది. అందులోని కథను కథనాన్ని చూచి ఆనాడే చాలామంది పాఠకులు ఆశ్చర్యపోయారు. అలా రావిశాస్త్రి తనతో బాటు కొత్తదనాన్ని తెలుగు నవలా రంగంలోనికి తెసుకొచ్చాడు.

"అల్పజీవి"లోని కథావస్తువు ఆత్మన్యూనతా భావం (inferiority complex) కథనశిల్పం చైతన్య స్రవంతి (stream of consciousness) 'అల్పజీవి'కి ముందు బుచ్చిబాబు 'చివరకు మిగిలేది', గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర' మాత్రమే మంచి మనోవైజ్ఞానిక నవలలుగా ప్రసిద్ధిచెందాయి. 'చివరకు మిగిలేది'లో ఈడిపస్ కాంప్లెక్స్ యితివృత్తం కాగా, "అసమర్థుని జీవయాత్ర" ఆలోచనాపరుడుగా భౌతికవాదంనుండి ఆధ్యాత్మిక వాదానికి గోపీచంద్ చేసిన ప్రయాణానికి సంకేతం 'అసమర్థుని జీవయాత్ర'లో ఆత్మన్యూనతాభావం యొక్క ఛాయలున్నా సీతారామరావు ఆభిజాత్యభావం అందులో ప్రధానం.

'అల్పజీవి'లోని అధీరనాయకుడు సుబ్బయ్యకు ఆత్మన్యూనత కలగటానికి కారణం చిన్నతనంలో సవతితల్లి అతని వ్యక్తిత్వాన్ని చిదిమివేయటం. తండ్రిని దొంగలు కొడుతుండగా అతడు చూడటం. అలా వ్యక్తిత్వాన్ని పోగొట్టుకున్న సుబ్బయ్య భార్యను, బావమరదిని, ఆఫీసర్ని, లోకాన్ని చివరకి తనను చూచి జడుసుకునే స్థితికి వచ్చాడు. మాజీ జమీందారులమని చెప్పుకునే భార్య, బావమరది అతని వ్యక్తిత్వాన్ని మరింత ధ్వంసం చేశారు. వీటన్నిటివల్లా భయం అతని జీవలక్షణమైపోయింది. భయం అతనినిత్యజీవిత కృత్యాలను అనుక్షణం ప్రభావితం చేసే న్యూరాసిస్‌గా పరిణామం చెందింది. ఆ 'భయం'లోనుండి బయటపడాలని సుబ్బయ్యచేసే విఫల ప్రయత్నమే 'అల్పజీవి'లోని కథావస్తువు. Theory of complexes కి మూలపురుషుడైన అడ్లర్ తన life style సిద్ధాంతాన్ని నిర్వచిస్తూ న్యూరాసిస్‌ను గురించి యిలా అన్నాడు.

"Every neurosis can be understood as an attempt to free oneself from a feeling of inferiority in order to gain a feeling of superiority"

ఈ సిద్ధాంతం సుబ్బయ్యకుసంపూర్ణంగావర్తిస్తుంది. ఆత్మన్యూనతాభావం వున్నవ్యక్తి సమాజం [society] ఉద్యోగం [work] సెక్సు రంగాలలో తనకులేని ఆధిక్యమును నిరూపించుకోవటానికి విఫల ప్రయత్నాలు చేస్తూంటాడని 'అడ్లర్' భావించాడు. సుబ్బయ్య గవరయ్యతో పడిన సంఘర్షణ అతని ఆత్మలోన్మీలనానికి కీలక సంఘటన. గవరయ్య పోరెత్తితే! భయంలో గజగజలాడిపోయే సుబ్బయ్య తన బావమరదికోసం అతనివద్ద తీసుకున్న ఐదువందల రూపాయలు ఇవ్వనని చెప్పటానికి చేసిన ప్రయత్నం సమాజంలో తన ఆధిక్యమును

నిరూపించుకోవటానికి చేసిన ప్రయత్నమే. అలాగే ఆఫీసులో పవర్పు జనిపించుకోవాలని, వంతులమ్మతో సంతృప్తికరమైన లైంగిక సంబంధాలు ఏర్పాటు చేసుకోవటానికి సుబ్బయ్య చేసిన ప్రయత్నాలు పై సిద్ధాంతాన్ని నిరూపిస్తున్నాయి. కాని, యీ మూడు ప్రయత్నాలలో భయం సుబ్బయ్యను అనుక్షణం ఎలా ప్రభావితం చేసిందో రా. వి. శాస్త్రి ప్రతిభావంతంగా నిరూపించాడు.

'అల్పజీవి'లోని కథనశిల్పం చైతన్య స్రవంతి **"Time is a continuous flow, but not a series of separate points"** అన్న బెర్గ్‌సన్ సిద్ధాంతము, ఫ్రాయిడ్ **norconscious** కు ఇచ్చిన నిర్వచనము, చైతన్య స్రవంతి కథన పద్ధతికి ఆధారాలు. ''అల్పజీవి''కి ముందు తెలుగులో చైతన్య స్రవంతి చెదురుమదురుగా వుండేది. శ్రీ శ్రీ ''కోనేటిరావు కలలు'' తెలుగులో వచ్చిన మొదటి చైతన్య స్రవంతి రచన. కానీ 'అల్పజీవి' తెలుగులో మొట్టమొదటి సంపూర్ణ చైతన్య స్రవంతి నవల. రా. వి. శాస్త్రి అంత సొదుపుగా, సమర్థవంతంగా చైతన్య స్రవంతి కథా కథన పద్ధతిని వాడినవారు తెలుగులో లేరు. బుచ్చిబాబులో అది అనవసర పాండిత్య ప్రకర్ష కాగా నవీన్‌లో **stream of unconscious**గా పతనం చెందింది.

ఈనాడు రా. వి. శాస్త్రి మనకున్న అత్యుత్తమ మార్క్సిస్టు నవలా కారుడుగా పరిగణించబడుతున్నాడు. కానీ 'అల్పజీవి' రచనా కాలానికి అతనిమీద మార్క్సిజం ప్రభావం కన్పించటంలేదు. 1951 నాటికి మహోధృతంగా విజృంభించిన తెలంగాణా పోరాటము, కమ్యూనిస్టు ఉద్యమమూ అల్పజీవిలో ప్రతిఫలించలేదు. కాని సుబ్బయ్య పాత్రకు ఆర్థిక సమస్య కీలకం. అతనికి కొంత ఆస్తి పాసు ఉన్నా, చివరకి గవర్రాజు బాకీ తీర్చటానికి అతనివద్ద ఐదు వందల రూపాయలున్నా సుబ్బయ్య పాత్ర మరోవిధంగా రూపొందవలసి వచ్చేది.

''సుబ్బయ్య సుందరుడు కాడు'' అన్నది నవలలో మొదటి వాక్యం. అతడు ధనికుడు, సాహసవంతుడు కాడు. స్త్రీ మనోరంజకుడు కాడు. ఇవి అతనికున్న యితర బలహీనతలు. కాపీ వంతులమ్మ సుబ్బయ్యను చూచి ఎందుకు ఆకర్షితురాలైంది? వంతులమ్మకు, గవరయ్యకువున్న సంబంధం ఎలాంటిది? ఆవిడ యివ్వమన్నంత మాత్రాన ప్రోనోటు గవర్రాజు ఎందుకు యిచ్చేశాడు? ఇలాంటివి 'అల్పజీవి' కథను గురించిన కొన్ని సందేహాలు...కాని, అల్పజీవి అంతరంగ కథనం ప్రధానమైన నవల. అందుచేత కథను అంతసూక్ష్మంగా పరిశీలించటం సరైన పద్ధతికాదు.'

''అల్పజీవి'' తెలుగులో వున్న ఉత్తమ నవలలో ఒకటి అనటానికి సందేహంలేదు. అనుభవానికి, కథగా మారిన అనుభవానికి మధ్యవున్న సంబంధమే శిల్పము. ఈ సంబంధము చక్కగా కుదిరినప్పుడు కథావస్తువులో సాధ్యమైనంత ఎక్కువభాగం అభివ్యక్త కథావస్తువుగా [achieved content] మారుతుందన్నది మార్క్ షోరర్ అభిప్రాయం. అత్మన్యూనతా భావం ప్రధానమైన నవలకు చైతన్య స్రవంతి సరైన కథన పద్ధతి అని తెలుసుకోవటంవల్ల నవలలో సరైన దృష్టికోణం కుదిరింది. చైతన్య స్రవంతిని పొదుపుగా, సమర్థవంతంగా నిర్వహించటంవల్ల అభివ్యక్త కథావస్తువు యొక్క రాశి పెరిగింది. ఈ రెండు కారణాలవల్ల ''అల్పజీవి'' చక్కని నవలగా రూపొందింది.

రావి శాస్త్రి రెండవ నవల ''రాజు మహిషి''

''రాజు మహిషి'' పాఠకుణ్ని దిగ్భ్రాంతుణ్ని చేసే నవల 'అల్పజీవి' తరువాత రావిశాస్త్రి కథలలో క్రమంగా రూపొందుతూ వచ్చిన శైలి 'రాజుమహిషి'లో విశ్వరూపంతో మనకు దర్శనమిస్తుంది. రావిశాస్త్రి లోకజ్ఞతకు, నిశిత పరిశీలనా శక్తికి 'రాజుమహిషి' కీర్తి పతాక. ఇందులోని గేదెల రాజమ్మ, మందుల భీముడు, భవానీశంకర ప్రసాదు, మిస్ ప్రేమ, హెడియా సజీవ పాత్రలు. కానీ ''రాజు-మహిషి'' చదివి పూర్తిచేసిన తరువాత రచయిత ప్రతిభను చూచి ఆశ్చర్యం తప్ప మరో అనుభూతి మిగలదు. కవి ప్రతిభా ప్రదర్శనే ప్రధానమైన కొన్ని పూర్వ కావ్యాలను పాఠకుడిలో కలిగే వ్యతిరేక భావం [negative reaction] 'రాజుమహిషి' చదివినప్పుడు కలిగే అవకాశం వున్నది. కథా ప్రయోజనం వెంట నడవవలసిన రచయిత ప్రతిభ. వశం తప్పి తనవెంట కథను, కథనాన్ని కథాప్రయోజనాన్ని లాక్కుంటూపోయింది. అందువలనే 'రాజుమహిషి'లో చక్కని కథ వున్నా కథాగమనం, సజీవ పాత్రలున్నా పాత్రోన్మీలనా కుంటుపడ్డాయి.

శ్రీ శ్రీ దృష్టిలో 'రాజుమహిషి' (అసంపూర్తిగా వున్నా సరే) నిజమైన క్లాసిక్. ఈ నవలకు 'అపరిచయం' వ్రాస్తూ శ్రీ శ్రీ పూర్తికాకపోయినా 'రాజుమహిషి గొప్ప నవలలకోవలోకి

చేరిపోయింది" అన్నారు. ఈ మాటలు వ్రాస్తున్నప్పుడు వారి మనసులో (బహుశః) కాఫ్కా అసంపూర్తి రచనలు మెదలి వుండవచ్చు. కాఫ్కా రచనా పద్ధతికి అతని రచనలు పూర్తికాకపోయినా ఫరవాలేదు. అతని అసంపూర్తి నవలలో కథకు ఒక పథకం కాని, కథనానికి ఒక పద్ధతి కాని కనిపించవు. మానవ హృదయంలోని అంతరాంతరాలలోవున్న భావాలను ఆవిష్కరించటమే ఆ నవలల ప్రధానోద్దేశ్యము. వాటిలో వాస్తవిక చిత్రణ ప్రధానం కాదు. కానీ, 'రాజ మహిషి' సమాజ పాత్ర చిత్రణ ప్రధానమైన నవల. ఇటువంటి నవల పూర్తికావటం, కాకపోవటం మధ్య చాలా భేదం వున్నది.

అసంపూర్తి మహాకావ్యాన్ని, అసంపూర్తి విగ్రహాన్ని క్లాసిక్‌గా కొనియాడటానికి వీలున్నది. కానీ ఆ అవకాశం అసంపూర్తి నవలకు తక్కువ. మహాకావ్యము, విగ్రహము—ముక్కలు ముక్కలుగా పరిశీలించి (శైలి, అలంకారము; ముక్కు, కన్ను వగైరా) ఆనందించటానికి వీలున్న కళారూపాలు. కానీ, నవల మొత్తంగా మాత్రమే పరిశీలించవలసిన సాహిత్య శాఖ. అసంపూర్తి నవలను క్లాసిక్‌గా పొగడటమంటే అందులో వ్యక్తమౌతున్న రచయిత ప్రతిభకు మాత్రమే ప్రాధాన్యమునిస్తూ — కథను, పాత్రపోషణను, అల్లికను నిరాదరించటమన్నమాట. ఇవన్నీ కూడా చివరి పేజీలో తారుమారు కావటానికి వీలుందన్న విషయాన్ని విమర్శకుడు మరచిపోకూడదు. ఉదాహరణకు "గోవులొస్తున్నాయి జాగ్రత్త"లో చివరిపేజీ మొత్తం నవల స్వరూపాన్నే మార్చివేస్తూంది. చివరి పేజీలేని "గోవులొస్తున్నాయి జాగ్రత్త" విలువ తప్పకుండా తక్కువే!

"రాజ-మహిషి" గొప్ప నవలగా రూపొందటానికి వీలు లేదనటం తప్పు. కాని అసంపూర్తిగా వున్నా గొప్ప నవలల కోవలోకి చేరిపోయిందనటం రావిశాస్త్రి ఆలోచనాశిల్ప మార్గాలను న్యాయం చేయటం మాత్రం కాదు.

"రాజ-మహిషి" పథకాన్ని నిశితంగా పరిశీలించినప్పుడు, ఆ నవల మరొక్క భాగంలో పూర్తి కాదేమోనన్న అనుమానం కలుగుతుంది. శైలి. శిల్పాలలో తేడా కనిపించకుండా 'రాజ-మహిషి పూర్తయిననాడు — గేదెల రాజమ్మ, మండుల భీముడు, ఆధునిక మధురవాణి గిరీశాలుగా రూపొందవచ్చునేమో!

'రాజ-మహిషి' రచన రావిశాస్త్రితో వచ్చిన పరిణామక్రమంలో ఒక ముఖ్యమైన మలుపు. సామాజిక దృష్టి ఉన్నతమైన 'అల్పజీవి' నుండీ, సామాజిక వాస్తవికత ప్రధానమైన 'రాజ-మహిషి'కి రావిశాస్త్రి పరిణామం చెందాడు. "రాజ-మహిషి' లోని సామాజిక వాస్తవికత. విప్లవాన గానంగా 'గోవు లొస్తున్నాయి జాగ్రత్త' తో మార్పు చెందింది. సూక్ష్మంగా యిది రావిశాస్త్రి నవలా ప్రస్థానం.

శిల్ప దృష్టితో చూసినప్పుడు 'అల్పజీవి' తో అంతరంగ కథనంతో ప్రారంభించిన రావిశాస్త్రి 'గోవు లొస్తున్నాయి జాగ్రత్త' తో పరోక్షమైన అంతరంగ కథనాన్ని స్వీకరించాడు. అందులోని కథకుడు (Narrator) కిరీటిరావు అన్న ఆంగ్ల మానస పుత్రుడు. అతడు పెట్టుబడిదారుగా మారిన ఫ్యూడల్ భూస్వామి. తన జాతి వాళ్ళకోసం (పెట్టుబడిదారుల కోసం) మనసువిప్పి దాపరికం లేకుండా కిరీటిరావు మాట్లాడుతాడు. వర్గ తత్వాన్ని బాగా అర్థం చేసుకున్న కిరీటిరావు తన కథనాన్ని పేదలు వినకూడదని, వింటే చెడిపోతారని హెచ్చరిస్తున్నాడు 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' లోని కథన శిల్పాన్ని (Dramatic monologue) అనవచ్చునేమో. కిరీటిరావు 1917 లో పుట్టి 1930 వ సంవత్సరంలో తన పెదనాన్న గారి జమిందారీ గ్రామమైన సువర్ణసుందరపురంలో గోవుల తిరుగుబాటు చూచాడు. ఈ సంవత్సరాల వెనుక ఏదైనా ప్రత్యేకార్థం వున్నదేమో ఆలోచించవలసిన విషయం.

"గోవులొస్తున్నాయి జాగ్రత్త"కు మరో పేరు "గుర్రపు కళ్లెం" శ్రీశ్రీ 'బుక్కులు' గా పేర్కొన్న కవితా వస్తువులను కథావస్తువులుగా నిరూపించటానికి రావిశాస్త్రి వ్రాసిన చివరి కథ యిది. కాని "గోవులొస్తున్నాయి జాగ్రత్త" అన్న పేరులో వున్న తీవ్రత. వ్యంగ్యం "గుర్రపుకళ్లెం" అన్న అతకని రెండవ పేరులో లేవు. ఈ నవలకు మూడో పేరు "మరిడ మహాలక్ష్మి కథ." ఈ పేరు నవలలో వున్న విప్లవభావనను అపహాస్యం పాలు చేస్తున్నది.

స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసు పార్టీ పతనానికి స్వాతంత్ర్యానికి పూర్వమే ఎలాంటి కారణాలున్నాయో యీ నవలలో రావి

---

**Kafka invented a world where the ordinary laws governing human conduct seem suddenly to have been surpended, leaving us with a sense that events are at once fortably premeditated and unpredictable.**

**— Martin Turnell in "Novelin France"**

శాస్త్రి చక్కగా నిరూపించాడు. రాజయోగి, శివకేశవరావుల కలయికను రావిశాస్త్రి ప్రతిభావంతంగా చిత్రించాడు.

గోవులు సాధుత్వానికి, అమాయకత్వానికి, పీడితవర్గానికి సంకేతాలు. అలాంటి గోవులు తిరుగుబాటు చేయడం యీ నవల లోని కథావస్తువు. కానీ, గోవులు వాటి తిరుగుబాటు చివర అధ్యాయాలలో మాత్రమే కనిపిస్తాయి. ముప్పాతికకు మించిన నవల, రాజయోగి పెదనాయనగారు అచ్చయ్యమ్మను ఎత్తుకు రావటం. ఆమె కుటుంబాన్ని నాశనం చేయటం. అందుకు సంబంధించిన కేసు, దాన్ని తప్పించుకోటానికి రాజయోగి ప్రయోగించిన ఎత్తులు, జిత్తులు— వీటితో నిండిపోయింది. సాంకేతికంగా గోవుల తిరుగుబాటుకున్న ప్రాముఖ్యమును కనీసం అక్కడక్కడా స్ఫురించి వుంటే బాగుండేది.

ఈ నవలలో గోవులు పీడితవర్గానికి, రాజయోగి ఫ్యూడల్ భూస్వామ్య వర్గానికి సంకేతాలు. గోవుల తిరుగుబాటు నాటికి (1930) మనదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒక భాగం - మన దేశం సామ్రాజ్యవాదపు ఉక్కు పాదాల క్రింద నలిగిపోతున్న కాలంలో ఒక చిన్న భూస్వామిమీద జరిగిన విప్లవం గోవుల తిరుగుబాటు. ఈ తిరుగుబాటుకు యింతటి ప్రాముఖ్యమును యివ్వటాన్ని మార్క్సిజం ఎంతవరకు ఆమోదిస్తుందన్నది వివాదాస్పదమైన విషయం. బ్రిటిష్ ప్రభుత్వ యంత్రాంగానికీ, రాజయోగికీ ఉన్న లాలూచీని దృష్టిలో సమర్థించినా, గోవుల తిరుగుబాటుకు రావిశాస్త్రి సూచించిన కారణం మాత్రం సమర్థనీయం కాదు. సాంకేతికంగా ఫ్యూడల్ భూస్వామ్య వర్గం మీద, పీడితవర్గం తిరుగుబాటుగా కనిపిస్తున్న గోవుల విప్లవానికి ప్రధాన కారణం రాజయోగి అచ్చయ్యమ్మను బలవంతంగా ఎత్తుకు రావటం— ఒక ఆడదాన్ని భూస్వామి ఎత్తుకు రావటాన్ని తిరుగుబాటుకు ప్రధానకారణంగా చిత్రించటం సరియైన మార్క్సిస్టు అవగాహన కాదు. ఈ కారణాన్ని కాక ఆర్థికమైన ప్రజా పీడనను గోవుల తిరుగుబాటుకు కారణంగా సూచించివుంటే, ఆ తిరుగుబాటుకు సిద్ధాంతబలమూ, సార్థకత అబ్బేవి. ఈ నవలలో రాజయోగి ప్రజా పీడకుడుగా చిత్రించబడలేదని కాదు. కానీ ప్రజాపీడనకు కూడ అచ్చయ్యమ్మను ఎత్తుకు రావటమే కారణం. అలాకాక గోశాల రాజకీయాలు గోవుల తిరుగుబాటుకు కారణమైనప్పుడు, అచ్చయ్యమ్మ వృత్తాంతం నవలలో ఎక్కువ భాగాన్ని ఆక్రమించటం శిల్ప దృష్ట్యా చాలా పెద్ద లోపం అవుతుంది.

ఈ నవలలోని ప్రధాన ఆకర్షణ కిరీటిరావు మాటకారితనం. అతని వర్ణనా పద్ధతి. అతడు ఉపయోగించే పదచిత్రాలు విచిత్రమైనవి, విశిష్టమైనవి. కాని తెలుగు నవలా సాహిత్యానికే గర్వకారణమైన రావిశాస్త్రి శైలి "గోవులొస్తున్నాయి జాగ్రత్త"లో వెర్రితలలు వేసిందనటానికి సందేహంలేదు. రచయిత తనకిచ్చిన అపార వాదనా నైపుణ్యాన్ని కిరీటిరావు పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను, పరపీడనను సమర్థించటానికి చాలా తెలివిగా నాజూకుగా వుపయోగిస్తాడు. తెలివితేటలున్న పాఠకుడు కూడా కిరీటిరావు వాదనే సరైనదని అంగీకరించేవిధంగా [Paradise Lost లో Satan వాదనలాగా) రావి శాస్త్రిగారి రచన సాగింది. ఈ నవలలోని వ్యంగ్యం గాడితప్పి వ్యతిరేక ఫలితాల నిస్తున్నది. ఈ అనుమానం రావిశాస్త్రికి కూడా రావటంవల్లనేనేమో అక్కడక్కడా వ్యంగ్యార్థాన్ని స్ఫురింపచేయటానికి వ్యాఖ్యానాలు చేశారు

కథాశరీరం చిన్నది కావటం, కిరీటిరావు ఒక్క ఉపన్యాసమే నవలకావటం ఈ రెండు కారణాలవల్ల రావిశాస్త్రి యితర నవలల్లో వున్న స్పష్టత యిందులో తగ్గింది.

రావిశాస్త్రి తనదైన శిల్పము, శైలి వున్న నవలాకారుడని ముందే మనవి చేశాను. ఉత్తమశైలి, శిల్పం ఎలా వుండాలి అన్నది చాలా చిక్కు ప్రశ్నే అయినా, అవి సాధ్యమైనంత అదృశ్యంగా వుండా లన్నది ఎక్కువమంది అంగీకరించే అభిప్రాయం. రావిశాస్త్రి మూడు నవలల్లోనూ శైలీ శిల్పాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. కథా ప్రయోజనాలను మించి ఒక్కొక్కసారి రచన శిల్పప్రధానమో, శైలీ ప్రధానమో అయిపోవటం రావిశాస్త్రిలో సర్వసాధారణ సంఘటన. రావిశాస్త్రి తన నవలలో శిల్పాని కిస్తున్న అనవసర ప్రాధాన్యమును తగ్గించకపోతే, అది పాఠకుని బుద్ధిని తాకి, ఆశ్చర్యపరుస్తాయేతప్ప మనసును తాకవు. దాన్ని సాధించలేనప్పుడు రావిశాస్త్రి తన నవలల ద్వారా ఆశిస్తున్న ప్రయోజనం నెరవేరదు.

కొడవటిగంటి కుటుంబరావుగారి అభిప్రాయం ప్రకారం రావిశాస్త్రి వచన రచయితలలో అప్పమైన కవి. నవలల్లో కవిత్వం వుండరాదని చెప్పటం సాహసమే కావచ్చు. కానీ, చారిత్రకంగా నవల కవితకున్న ప్రాధాన్యమును తగ్గించటానికే ఆవిర్భవించిందన్నది నిర్వివాదం. రావిశాస్త్రి కవిత వారి వ్యంగ్యంలాగా అనేకచోట్ల గాడి తప్పుతుంది. వారి వర్ణనలు ఒక్కొక్కసారి పౌరాణికంగా, చాలాసార్లు ప్రాబంధికంగా, ఎక్కువసార్లు కాల్పనికంగా వుంటాయి. ఈ వర్ణనల లో చాలాభాగం ప్రబంధాలలోలాగా నవలా శరీరానికి అతకటం కూడా లేదు. భావుకుడుగా రావిశాస్త్రి కాల్పనికోద్యమ ప్రభావం నుండి యింకా బయటపడలేదు. అందుకే కిరీటిరావు వంటి పాత్ర చేత "అవిడ (లచ్చుంబ్యమ్మ) శ్రావణమాసపు వరద గోదావరే కాని, కార్తీక మాసపు నరస కిన్నెరసానికాదు"—అనిపించాడు. తనకున్న కాల్పనిక కవితాభిలాషను తీర్చుకోవటానికి ఒక "దమ్మిడీ కవీశ్వరుణ్ణి" కూడా "గోవులొస్తున్నాయి జాగ్రత "లో సృష్టించాడు. ఈ దృష్టి, మార్క్సిస్టు సాహిత్యానికి ప్రాణభూతమైన సోషలిస్టు వాస్తవికతలో పొసగదు.

రావి శాస్త్రి శైలికున్న మరొక బలహీనత వాచాలత [loquacity] అందుకు ప్రధాన కారణం మాటలమీద, మాటల గారడీ మీద అతనికున్న విపరీతమైన మోజు. అందువల్ల "రాజా—మహిషి" రాశితో పెరిగింది. "గోవులొస్తున్నాయి జాగ్రత్త"లో పఠనీయత [readability] తగ్గింది. విశాఖ జిల్లా మాండలిక పద ప్రయోగాన్ని పుణికిపుచ్చుకున్న రావిశాస్త్రి, తన కవితాభిలాషను, ఉపన్యాస ధోరణిని దానికి జోడించడంవల్ల సహజత్వం అక్కడక్కడా లోపిస్తోంది.

స్పష్టమైన సామాజికావగాహనతో, లక్ష్యశుద్ధితో రచన చేస్తున్న నవలా రచయిత రావిశాస్త్రి. మానవ ప్రవర్తనను, సమాజంలోని వివిధ వర్గాల సంబంధాలను రావిశాస్త్రిలాగా నిశితంగా పరిశీలించగల మరొక నవలాకారుడు తెలుగులో లేడు. ఇంతవరకూ రావిశాస్త్రి తెలుగు భాషకు గర్వకారణమైన నవల వ్రాయక పోవటానికి కారణాలు— అతని వర్ణనా వ్యామోహము, భాషా ప్రలోభము. కానీ రావిశాస్త్రి వర్ణనలు శైలి, అతణ్ణి యింతవాణ్ణి చేశాయి. కానీ అవికాస్త గాడితప్పటంవల్ల యింకా ఎంతో గొప్పవాడు కావలసిన రావిశాస్త్రి కాలేకపోతున్నాడు.

తనమీద ఎంతో బలంగావున్న కాల్పనికోద్యమ ప్రభావాన్ని వర్ణనా వ్యామోహాన్ని, భాషాప్రలోభాన్ని తగ్గించుకున్నాడా రావిశాస్త్రి మాత్రమే తెలుగు భాష గర్వించదగిన నవల వ్రాయగల అర్హత వున్న రచయిత.

# జ్ఞాపకం

శ్రీ కె. ఎస్. ఎ. నరసింహం

గేటుముందు ఆగి ఏమని పిలవాలో తెలీనటు తటపటాయిస్తూ నిలుచున్నాడు యువకుడు.

సాయంత్రం వెలుతురులో తోట అందంగా వుంది. ఆ తోటలో ఆ చిన్నయిల్లు చాలా ముచ్చటగా వుంది. ఆ పరిసరాల్లో అంతా కూడా 'మంచితనం' ప్రతిఫలిస్తోంది.

గేటు తీసుకుని లోపలికి వెడదామా అనుకుని అంతలో ఆ ప్రయత్నం మానుకున్నాడు యువకుడు. వరండాలో కనిపించిన నడి వయస్సు దాటిన మనిషిఆకారం చూసి అప్రయత్నంగా గొంతు సవరించుకున్నాడు. సార్ ! ... ..." అని పిలిచేడు.

అడ్డపంచెమీద ఫుల్‌బనీను, ఎగదువ్విన క్రాఫ్‌ను బ్యాలెన్స్ చేస్తూ నల్లరంగు ఫ్రేము కళ్ళజోడు—ఆయన ప్రశ్నార్థకంగా చూస్తూ గేటుదగ్గరి కొచ్చేడు. "ఎవరూ ?–" అన్నాడు.

"సుశీలమ్మ టీచర్‌గారిల్లు ఇదేకదండీ ?–"

"అవునూ ?..."

"నేను ఎలిమెంటరీస్కూల్లో టీచర్‌గారి స్టూడెంట్‌నండీ... కొండకని వచ్చేను... ...టీచర్‌నికూడా చూసిపోదామని... ..."

"ష్యూర్ !...ప్లీజ్ కమ్...రండి రండి..." గేటుతీసి తనని లోపలికి తీసుకుపోతూన్న—ఆయనే—టీచర్ భర్త—అని గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు యువకునికి. ఆయన చూపించిన పేము కుర్చీలో కూచున్నాడు. టీపాయ్ మీది పత్రిక చేతుల్లోకి తీసుకున్నాడు.

"సుశీ !..."

"...కాఫీ రెడీ..."

"అదికాదు, నీకోసం ఎవరో వచ్చేరు..."

"నాకోసమా ! ?...ఎవరూ ?..."

"ఎవరో ఎలిమెంటరీ స్కూల్లో నీస్టూడెంట్‌ట..."

"ఎప్పటి ఎలిమెంటరీస్కూలూ ? ... ఏనిమిదేళ్ళ క్రిందటి మాట..."

"నిన్ను చూద్దామని వచ్చేట పాపం..."

"ఎవరబ్బా అతనూ ?...సరే...ఇదుగోండి మీకాఫీ... ...నేను రెణ్నిమిషాలో మాట్లాడొచ్చేస్తాను..."

"తొందరేం లేదులేదూ ... నేను పేపరు చదువుకుంటూంటాను..."

* * *

సుశీలమ్మ టీచర్ రావడం చూసి లేచి నిలబడ్డాడు యువకుడు.

"ఎవరూ?–" అంది ఆవిడ ప్రశ్నార్థకంగా బొమలు ముడివేస్తూ:

"నమస్తే టీచర్—నేను—సుదర్శనాన్ని..."

ఆ పేరువిన్న సుశీలమ్మ క్షణకాలం ఆలోచనలో పడింది.

"మునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్లో మీ స్టూడెంట్‌ని టీచర్!... నన్ను గుర్తుపట్టలేదూ? సుదర్శనం అనడానికి బదులుగా 'సుదూ' అని పిలిచేవారు మీరు నన్ను..."

"సుద్దూ...అంటే సుదర్శనం...సుద్దూ...ఓ!...అంటే...

అంటే..." అస్పష్టంగా తనకు తాను చెప్పుకుంటూన్న సుశీలమ్మ నొసటిమీది ప్రశ్నార్థకం మెలమెల్లగా మాయమైంది.

ఆమె ముఖంలో భావం ప్రసన్నంగా మారేసరికి సుదర్శనం ముఖంలో సంతోషం పొంగింది.

"రావడం తిరుమల కొండకనే వొచ్చేను టీచర్! కాని, మిమ్మల్ని చూడందే వూరికెళ్ళిపోవాలనిపించలేదు..."

"చాలా సంతోషం...అరె...నిలబడే వున్నారేం? కూచోండి"

తనూ అతని కెదురుగా కుర్చీలో కూచుంది సుశీలమ్మ. మాట వరసకి అతను కూచున్నాడనేగాని, అతని భంగిమలో — ఎదురుగా గురువు వున్నప్పటి భక్తి, గౌరవ భావాలు వుట్టిపడుతూనే వున్నాయి.

"అయితే—ఇంతకీ మీరిప్పుడుంటున్న దెక్కడ ?..."

"విశాఖపట్నంలో టీచర్... ఈ మధ్యనే వుద్యోగం కూడా దొరికింది...జంబూ అండ్ బ్రదర్స్ అని ... వొక ప్రయివేట్ కంపెనీ...అయినా మంచి వుద్యోగమే టీచర్..."

టీచర్ అడగడమే తడవుగా సమాధానాలు చెప్తున్నాడతను. అతనివంక పరిశీలనగా చూస్తూ నవ్వుతూ అడిగింది సుశీలమ్మ: "అన్నట్టు—మీకు పెళ్ళయిందా?..."

"ఇంకా లేదు టీచర్!...వినయంగానూ లజ్జగానూ అన్నాడతను. "మరో మూడేళ్ళదాకా ఆ ప్రయత్నాలు వద్దనుకున్నాను... నాకాళ్ళమీద నేను పూర్తిగా నిలబడాలిగా..."

అవునన్నట్టు తలూపింది సుశీలమ్మ: "అదే మంచిది లెండి..."

చప్పున తలెత్తి చూస్తూ అన్నాడతను—"అదేమిటి టీచర్... మీరు నన్ను 'అండీ' అంటున్నారు...మీ సుద్దూ ఇంతలో మీకు పరాయివాడై పోయేడా?..."

అతని మాటలకి క్షణకాలం ఆశ్చర్యపోయింది సుశీలమ్మ. ఆ తర్వాత నిండుగా నవ్వింది. ఆమె కళ్ళలో వింత మెరుపు మెరిసింది. నిట్టూర్పుతో అంది: "నిజం చెప్పనా సుద్దూ?..."

సుద్దూ వురఫ్ సుదర్శనం ఆసక్తిగా ముందుకు వంగేడు.

"నిన్ను చూడగానే నాకు వింతో ఆనందమనిపించింది. నిన్ను సుద్దూ అని ప్రీతిగా పిలవాలనే అనిపించింది. కాని, ఎందుకో వెను కాడేను. సుశీలమ్మ టీచర్ని చూడాలనే వొచ్చేవు నువ్వు. నీ మనస్సు మారలేదు. కాని, సంఘంలో మనిషిగా నువ్వు మారుండొచ్చుగా!? నిన్నింకా సుద్దూ అని పిలిస్తే ఏమనుకుంటావోనని..."

సుదర్శనం కళ్ళు ఆర్ద్రతతో నవ్వేడు. గొంతు పెగుల్చుకుని మాట్లాడుతున్నట్టు—"అదేమిటి టీచర్—అలాగంటారూ?..." అని మాత్రం అనగలిగేడు.

ఆ తరువాత సంభాషణ గడచిపోయిన రోజులమీదికి మళ్ళింది.

"గుర్తుందా టీచర్! నే నెప్పుడూ క్లాస్‌లో వెనక బెంచీలో కూచునేవాణ్ణి...ముందుకొచ్చి కూచొమ్మని మీరెన్నిసార్లు చెప్పే వారని!...నేనెప్పుడూ క్లాస్‌కి లేటుగా వొచ్చేవాణ్ణి...లేటుగా వొచ్చిన వాళ్ళందరితోబాటు నన్నుకూడా ఎండలో నిలబెట్టే వారు మీరు... ఆ తరువాత నన్నుమాత్రం చాటుకి పిల్చి ఇంకెప్పుడూ లేటుగా రావొద్దని మందలించేవారు...నేను బుద్ధిగా తలూగించేవాణ్ణి!...మరునాటి దినం మళ్ళీ అలవాటుగా లేటుగా రావడం, మీరు మళ్ళీ ఎండలో నిలబెట్టడం, మళ్ళీ మందలించడం..."

అలనాటి స్మృతులవెంట పరుగెడుతున్నాయి సుశీలమ్మ ఆలోచనలు. సూర్యరశ్మిలాంటి నవ్వు ఆమె పెదవులమీద పరుచుకుంది.

సుదర్శనం చెబుతున్నాడు

"అయిదోక్లాస్‌కి లీడర్‌గా నన్ను మీరే పెట్టేరు. లీడర్‌గా వుండనని నేను మారాం చేసేను. మీరు కళ్ళెర్రజేసి మరీ వొప్పించేరు...క్లాస్‌లో అందరూ నన్ను తెగ ఏడిపించేవాళ్ళు. అల్లరి చేసేవాళ్ళని మంచోబెట్టమని నాకు చెప్పి మీరటువెళ్తే — అందరూ కలిసి నా పుస్తకాలూ పంచీ దాచేసేవాళ్ళు — మీరొస్తే మీతో చెప్పుకుని బావురుమనేవాణ్ణి నేను... "ఇంత అమాయకుడివి... ఎలా బ్రతుకుతావు సుద్దూ..." అనేవారు మీరు..."

సుశీలమ్మ ముఖంలో వాత్సల్యం తొణికిసలాడింది. నిట్టూరుస్తూ అంది: "అవును సుద్దూ!...ముందు బ్రతుకులో మనుషు లెలా వుంటారో...వాళ్ళ పసితనంలోనే తెలిసిపోతుంది... మంచిగా వుండడం మంచిదే...కాని, మంచికూడా మితిమీరితే ప్రమాదం కదూ ?... ..."

సుదర్శనం నవ్వేడు, టీచర్ చెప్పిన దానిని గురించి ఏదో చెప్పాలని కాబోలు అనుకున్నాడు. కాని, మానుకున్నాడు.

"చిన్నప్పుడు మాయింట్లో అంతా మీగురించి చెప్పుకునే వాళ్ళు...మా అమ్మ మిమ్మల్నొకసారి యింటికి తీసుకు వచ్చింది -- దీపావళిరోజున మీరు మాయింటికొచ్చేరు. నేను క్లాస్‌లో ఎంతో బుద్ధిగా వుంటాననీ అల్లరి చెయ్యననీ మా అమ్మదగ్గర ఎన్నెంతగా పొగిడేరనుకున్నారు !... ..."

"అన్నట్టు ...మీ అమ్మగారు కులాసాగా వున్నారా ?..."

"ప్చ్ ! ఆరునెల్లుగా అమ్మవొంటో అంత స్వస్థతగా లేదు టీచర్... ... పదిహేనురోజుల క్రితమే ఆపరేషన్ కూడా చేసేరు... అమ్మకి నయమైతే కొండకి వొస్తానని మొక్కుకున్నాను ... ఇప్పు డింట్లో ఇంకెవరూ లేరు ... అమ్మకి సాయంగా సుజీ వొక్కతే వుంది..."

"సుజీ-అంటే మీ అక్కయ్య కదూ ?..."

"కాదు టీచర్-మా చెల్లెలు..."

"ఓ...ఎప్పుడనగా చూసేను!...ఏమైనా చదువుతోందా?..."

"వూహూఁ...లేదు టీచర్...ఎస్సెస్సెల్సీ ఫేలైంది. పైకి చదవనని తనే మానేసింది...అది చదివితేనే బాగుండేదేమో టీచర్... కాని ఏం చెయ్యడం ?...మా పరిస్థితులు..."

సుశీలమ్మ పెదవులు మౌనంగా వొంపు తిరిగేయి. ఆమె ఏమీ చెప్పలేకపోయింది. నిమిషకాలం మౌనంగా వుండిపోయింది.

సుదర్శనమే అన్నాడు :

"ఇప్పుడు మీరు హైస్కూల్లో కదా టీచర్—పనిచెయ్యడం?... నేనసలు మొదట ఎలిమెంటరీ స్కూల్‌కి వెళ్ళి వాకబుచేసేను... హైస్కూల్లో మీరు ఏయే క్లాస్‌లకి చెబుతారు టీచర్ ?... ..."

"తొమ్మిదో క్లాస్‌దాకా చెబుతాను ... కాని, ఏముందిలే సుదూ ... చెప్పినపాఠాలే చెప్పడం ... గంటకొడతారు ... క్లాస్‌కి వెళ్ళాలి... గంటకొడతారు...క్లాస్ ముగుస్తుంది...గంటమీదగంట... రోజుమీద రోజు...మధ్యమధ్య ఆదివారం...వారాలు—నెలలు—సంవత్సరాలు గడిచిపోతాయి ... కాని—ఇందులోనూ చెప్పలేని ఆనందముంది సుదూ - పాఠం చెప్పేప్పుడు నాముందు విచ్చిలేతముఖాలు...వాటిలో ఎంత అమాయకత్వం! వాటి వెనుక ఎంత భవిష్యత్తు !! సంవత్సరం గడిస్తే పిల్లలు పైక్లాస్‌కి వెళ్ళిపోతారు...అప్పుడెంత విషాదమనిపిస్తుంది ! మళ్ళీ అంతమందీ కొత్తగా చేరతారు...అప్పుడెంత వుత్సాహమనిపిస్తుందో తెలుసా ? ఈ జీవిత రహస్యం ఏదో ఇట్లోనే తెలిసిపోతూవున్నట్టనిపిస్తుంది..."

టీచర్ మాటల్ని తన్మయుడై బేలకళ్ళతో వింటున్నాడు సుదర్శనం.

కుర్చీలోంచి లేచింది సుశీలమ్మ - "కాఫీ తెస్తానుండు సుదూ" అంటూ.

"అబ్బే ! ఇప్పుడెందుకు టీచర్..." అన్నాడు సుదర్శనం ఇబ్బందిగా.

"భలేవాడివే...రాకరాకవొస్తే...ఇంతకాలానికి..."

టీచర్‌చేతి కాఫీ తాగిన సుదర్శనానికి మనసు నిండుగా అనిపించింది. అతనికి చెప్పలేనంత ఆనందంగా వుంది.

టీచర్ ఇంకా మాట్లాడుతూనే వుంది.

మెత్తగా చల్లగా ఆత్మీయంగా ఆప్యాయంగావున్న ఆమెగొంతు వింటూ, అక్కడక్కడా తెల్లబడి—మాటాడేప్పుడు కదలికకు అతి చిన్నగా కదులుతూన్న ఆమెముంగురులను చూస్తూ పాతపాతసంగతు లేవో లోలో మెదుల్తూండగా అలాగే చాలాసేపు కూర్చుండి పోయేడు సుదర్శనం.

"అయితే రేపే వూరెళ్ళిపోతావా సుదూ ?..." అని టీచర్ అడగా విని, పరిసరాల్ని కలయజూసి కొద్దిగా ఆశ్చర్యపడ్డాడు సుదర్శనం...

చీకటిపడి చాలాసేపైంది. తోటలో పువ్వులు మాత్రం గుడ్డివెన్నెలలో జాలిగా మెరుస్తున్నాయి.

సుదర్శనం తేరుకున్నాడు "ఔను టీచర్ ! వెళ్ళాలి... రేపే వొచ్చేస్తానని అమ్మతోచెప్పి వొచ్చేనుకూడాను—" కుర్చీలోంచి

తెచేడు— "మీరు మావేపు ఎప్పుడైనా వొస్తే... మా యింటికి రావాలి టీచర్...మర్చిపోకూడదు..." అన్నాడు.

"విశాఖపట్నం రావాలే గాని...సుద్దూ ఇంటికి రాకుండానా?..." అంటూ సుదర్శనం రాసిచ్చిన అడ్రెస్ అందుకుంది సుశీలమ్మ.

"—మరి—నే వస్తాను టీచర్...!" అన్నాడు సుదర్శనం. ఆ మాట అంటూండగా అతనిగొంతు ఎందుకో బొంగురుపోయింది.

తీరాన్ని వదిలిపోయే నౌకలోవున్న మనిషి కళ్ళలో సుళ్ళు తిరిగే సముద్రపు టగాధాలు నీలగగనాల అనంతాలు అతని కళ్ళలో ప్రతిఫలించేయి.

మాటలో చెప్పలేని భావాల్ని నొక్కివడుతున్నట్టుగా అతను రెండు చేతులూ జోడించి టీచర్‌కి నమస్కారం చేసేడు.

సుశీలమ్మ టీచర్ చలించిపోయింది. అప్రయత్నంగా నవ్వింది. ప్రతినమస్కారం చేసింది—"మంచిది సుద్దూ — అలాగే—వెళ్ళిరా..."

కలలోలాగా వెనుదిరిగి చిడీలు దిగి గేటుతెరిచాడు సుదర్శనం గేటు తెరిచేక అతనొక క్షణం ఆగేడా? లేదా? ఆగేడనిపించింది సుశీలమ్మకి. రోడ్డెక్కిన అతను దూరమైపోయి చీకట్లో కలిసి కనుమరుగయ్యేక గేటువేపు చూస్తే అది ఇంకా కూడా చిన్నగా వూగుతూ కనిపించింది...

* * *

"మీ సుదర్శనం...అదే—సుద్దూ...నిజంగా ఎంత మంచి వాడు సుశీ!...ఈ ప్రక్క గదిలోకి మాట వినబడుతూనే వుంది ... పాపం—నువ్వంటే ఎంత భక్తి...ఇంకా కూడా!..."

"వూఁ..."

"ఎప్పుడో—చిన్నప్పుడు...ఎలిమెంటరీ స్కూల్లో టీచర్‌వి... అంతేగా కాని, ఎంతగా గుర్తుపెట్టుకున్నాడు నిన్ను—అరె-అలా వున్నావేం?..."

"హూఁ—ఏమీలేదు...అతను నిజంగా ఎంతో మంచివాడు. కాని, ఇంతసేపూ అంత జాగ్రత్తగా నటించడానికి నేనెంత కష్టపడ్డానో ?!..."

"...అంటే?..."

"నిజానికి—అతనెవరో ఏమిటో నాకు...ఏమీ జ్ఞాపకంలేదు...

---



# కిటికీనుండి దూకిన

శ్రీ మాదిరాజు రంగారావు

(వియత్నాం క్రాంతి కవితలు నుండి)

కిటికీ నుండి దూకిన వెలుగు
జ్ఞాపకం చేస్తోంది
ఇంటి ముందు కదిలే అగ్ని పత్రాల నూ
ముంగిట్లో సరించే రక్త చిత్రాలనూ

రెండు మూడు దశాబ్దాలు
చావు బ్రతుకుల సంధ్యలో
పక్షివలె మన్న ఈ దిక్కులో
విగిరి గంతు వేసింది మానవత,
లెక్కలేని ఉదయాలను మరపిస్తూ
బ్రతుకుపై విశ్వాసం రగిలిస్తూ.

గుండెనుండి విగిసింది భయశబ్దం
మరపిస్తూ తుపాకి గుండును.
కళ్ళముందు పరచుకొంది విజయరూపం
మరపిస్తూ ఇన్నేళ్ళ బాధను.

అద్దం ముందు నిల్చొంటే
కన్పిస్తోంది గదిలో ఒక మూల
పదిలంగా ఉన్న వయొలిన్,
హృదయం తీసి ఉంచినట్లు.

గుండెలో మ్రోగే సంఘర్షణతో
ధమనుల్లో వర్తించే విప్లవధునితో
ప్రేలి ప్రేలి అగ్నిపర్వతం
ఆగింది చిత్రంగా ఈ క్షణం.

మతిలో ఎగిరే కపోత శ్రేణితో
నాడుల్లో సాగే సంగీత ధారతో
ఇపుడో వెలసింది హిమశీతల శిఖరం
విలయ నిశకు జీవంపోస్తూ ఈ సమయం.
కిటికీ నుండి దూకిన వెలుగు
క్రమిస్తోంది వచ్చిన దారిని
అమూల్యమైన జీవితాన్ని
ఇంత కాలం బంధించిన
గుప్పిలి సడలిస్తూ—మనిషియొక్క,
హార్దం కలిగిస్తూ - మనిషికీ.

కిటికీ నుండి కన్పిస్తోంది
నా వెనుకనే గగన ఖండం,
విత్తిన చరిత్ర ముఖంవలె
వియత్నాం భుజాలపై.

కిటికీ నుండి నిష్క్రమించిన వెలుగు
జ్ఞాపకం చేస్తుంది విప్పటికీ,
విదలో కదలే స్మృతి చిత్రమై
ఇంటిముందు ఆకురాలిన వృక్షాన్ని.

అగ్ని పర్వతం ఎగసిపోయింది
రక్త చిత్రం మాసిపోతుంది.
కదలనీ ప్రవహించనీ కాలం
స్పందిస్తూ నవశాంతి గీతం.

---

# శ్రీకృష్ణదేవరాయలు

## కళింగ దిగ్విజయయాత్రలో ఓటమిని చవిచూచెనా?

డా. సి. వి. రామచంద్రరావు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి అల్లసాని పెద్దనార్యుని మొదలు ఆధునిక చరిత్రకారులు విజయనగర చరిత్ర చతురాననులు నగు డాక్టర్ నేలటూరు వేంకటరమణయ్యగారివరకుగల కవులు, పండితులు, చరిత్రకారులు అందరును తాము గావించిన శ్రీకృష్ణదేవరాయల కళింగ దిగ్విజయ యాత్రా కథనములందు, కృష్ణరాయలు, నాడు ఉత్తరమున చిల్కాసరస్సు మొదలు దక్షిణమున నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి వరకుగల తీరాంధ్రదేశమును, తెలంగాణాలో ప్రాగర్థమును ఏకచ్ఛత్రాధిపత్యముగ పాలించుచున్న ఓఢ్ర ప్రభువు ప్రతాపరుద్ర గజపతిపై గెలుపు వెంబడి గెలుపు సాధించి, యుద్ధయాత్రలో ఉదయగిరి, అద్దంకి వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరం, కొండవీడు, కొండపల్లి మొదలయిన తీరాంధ్ర గిరిదుర్గ స్థలదుర్గాలను, అనంతగిరి, ఉండ్రుకొండ, ఉల్లకొండ, ఆరువపల్లి జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి, నల్లగొండ, కంభంమెట్టు, కనకగిరి, శంకరగిరి ఇత్యాది తెలంగాణా దుర్గాలను ఏకధాటిని వశపరచుకొని, సింహాద్రి–పొట్నూరు చేరి అచట జయస్తంభము వేయించెననియు, అంతటితో ఆగక అచటనుండి గజపతుల రాజధాని కటకమువరకు సైన్యముల తరలించి, ప్రతాపరుద్ర గజపతి ప్రాణభీతితో వింధ్యాటవులకు పారిపోగా, ఆ నగరమును కొల్లైననియు తెలుపును.[1] కృష్ణరాయల శాసనములు గూడా ఈ కథనములను బలపరచుననై యున్నవి,[2] నేలటూరు వెంకటరమణయ్యగారు రాయల ఈ పూర్వ దిగ్విజయ యాత్రను ఆరుఘట్టములుగ విభజించి, శాసనాధారములతో, సారస్వతాధారములతో మిగుల విపులముగ చర్చించియున్నారు.[3] ఈ దిగ్విజయయాత్ర క్రీ. శ. 1512–1518ల మధ్యగల కాలమున జరిగినట్లు నిరయించి యున్నారు.[4] వెంకటరమణయ్యగారి కథనమునగాని, ఈ దిగ్విజయయాత్రనుగూర్చి వ్రాసిన మరెవ్వరి కథనమునగాని, రాయలు గజపతి సైన్యములచే ఒకసారియైనను ఓడింపబడినట్లు చెప్పియుండలేదు. సమకాలీన విజయనగర సాహిత్యము నందుకాని, శాసనములందుకాని, అటు తర్వాతి విజయనగర సాహిత్యమునందుకాని, శాసనములయందుకాని, విదేశ యాత్రికుల వ్రాతలందుకాని రాయలు ఓటమి చవిచూచినాడను ప్రసక్తియేలేదు. సమకాలీన లేక అటు తర్వాతి విజయనగర వాఙ్మయము, శాసనములు విజయనగర ప్రభువుల ప్రశస్తింతించుటే ధ్యేయముగాగలవి గావున, ఒకవేళ కృష్ణరాయలు ఓటమి నొకదాని నెరిగి యున్నను, దానిని అవి పేర్కొనుట జరుగదు. విదేశీయులు బహుశః దీనిని గురించి వినియేయుండరు. రాయలు చవిచూచిన ఇట్టి సందర్భమునకై ఓఢ్రదేశమున లభ్యమగు ఆకరములయందు వెదుకవలసి యుండును.

కృష్ణరాయలు గజపతి సైన్యములచే ఓటమి చవిచూచెనని సూచించు ఆధారమొకటి గజపతి సమకాలీన సారస్వతమున గలదు. లొల్ల లక్ష్మీధరుడు ప్రతాపరుద్ర గజపతి ఆస్థానము నలంకరించిన బహుముఖ ప్రజ్ఞాశాలి. 'అద్వైతమకరంద' మను వేదాంత గ్రంథమును, 'సౌందర్యలహరి' వ్యాఖ్యను, ప్రతాపరుద్ర గజపతి పేరట 'సరస్వతీ విలాస' మను ధర్మశాస్త్రగ్రంథమును రచించినవాడు.

ప్రతాపరుద్రగజపతి ఆస్థానమును అలంకరించిన మరియొక ప్రతిభాశాలి, ఆర్యవిద్యాకూటమైన నవద్వీపమున 'నవ్య-న్యాయ' సంప్రదాయమును నెలకొల్పిన వాసుదేవ సార్వభౌముడు. ప్రతాపరుద్ర గజపతి మంత్రి, దండనాయకుడునైన కుమారవిద్యాధరుని ప్రేరణతో వాసుదేవ సార్వభౌముడు లక్ష్మీధరుని అద్వైతమకరందమునకు వ్యాఖ్య వ్రాసినాడు. ఈ వ్యాఖ్యా పీఠికలో సార్వభౌము డీక్రింది శ్లోకమును చెప్పియున్నాడు.

> "కర్ణాటేశ్వర కృష్ణరాయ నృపతేర్గర్వాగ్ని నిర్వాపకో
> య స్తస్యాస్తు భరోఽభవద్ గజపతిః శ్రీ రుద్రభూమీపతిః
> తస్య బ్రహ్మ విచార చారుమనసః శ్రీకూర్మ విద్యాధర
> స్యానన్ మకరంద శుద్ధి విధినా సాంద్రోమయామందరః [5]

ఇచట గజపతి శ్రీ రుద్ర భూపతి మంత్రియైన శ్రీ కూర్మ విద్యాధరుడు కర్ణాటేశ్వరుడైన కృష్ణరాయని గర్వాగ్నిని ఆర్పినటువంటివాడని చెప్పబడినది. అనగా కృష్ణరాయని ఓడించినాడనియే అర్థము చెప్పకొనవలసియున్నది. అనగా గజపతి సైన్యములు కృష్ణరాయని లేక అతని సైన్య వాహినిని, ఒకసారియైనను, నిర్జించిన వని అర్థము చెప్పవలసియుండును. వాసుదేవసార్వభౌముని వాక్యమును ఏదో పనుతిగా త్రోసిపుచ్చుటకు వీలులేదు. గజపతి సామాన్య శత్రువుగాడు. అతడు సామ్రాజ్య విస్తృతియందు, అంగబలమున, అర్థబలమున రాయలకు తీసిపోవు వాడు కాడు. కొండపల్లి వద్ద, కృష్ణానదీతీరమున అతడు రాయలను 1,300 గజబలము, 20,000 అశ్వికబలము, 5 లక్షల కాల్బలముతో మోటుకొన్నాడు.[6] అప్పాజీ మాట వినకుండా కృష్ణరాయడు సింహాద్రిదాటి సైన్యమును కటకమువైపుకు నడపించుకొనిపోయి, శత్రువ్యూహమున జిక్కుకొని క్లిష్ట పరిస్థితికి లోనయ్యెననియు, అప్పాజి తన బుద్ధిచాతుర్యముచే గజపతికి అతని షోడశ మహాపాత్రులకు భేదము కల్పించి, రాయలనా విషమపరిస్థితినుండి రక్షించెననియు రాయవాచక, కృష్ణరాయ విజయములు నుడువుచున్నవి రాయల పరిస్థితిని 'కృష్ణరాయ విజయము' ఇట్లు వర్ణించినది.

తే॥ ఇలంబదార్వురు రాజుల చెలువు గలిగి
యల చతురశ్రభావముల్ గెలువంబూను
నట్టి ఘనులైనకా వారి నణంచ వశమె
పదరి వచ్చితి మప్పాజిపలుకు వినక.

క॥ అని యాలోచనఁజేయుచు
మనమున నా రాత్రి యుబ్బు మఱుగున బాళెం
బునఁగల జను లవ్వార్తలు
విని యుత్సాహంబులేని విధమెఱిఁగి వెసన్.

ఆ॥ అయ్యెదంత మప్పుడప్పాజితోఁ దెల్ప
నాడు పల్కు వినక నరవరేణ్య
వచ్చినంత యింత వచ్చెఁగదా యింద
కేమిసేయువార మిచటఁ జెపుమ.

తే॥ అనుడు రాయలు పల్కె నీ వనినమాట
లెక్కసేయమి యిచ్చోటఁ జిక్కువలసెఁ
దలఁప నినువంటి మంత్రి యుద్ధాత్రిఁగలడె
చూడమిందులకొకయుక్తి సూక్ష్మమతిని." [7]

ఇట్టి పరిస్థితిలో గజపతి సైన్యములు, శ్రీ కూర్మవిద్యాధరుని నాయకత్వమున, రాయల సైన్యములను అతని సమక్షముననో పరోక్షముననో ఒకానొక యుద్ధమునందు నిర్జించి యుండవచ్చును. రాయలకు సంభవించిన అట్టి ఒక ఓటమి ఆధారముగ వాసుదేవ సార్వభౌముడు శ్రీ కూర్మవిద్యాధరుని 'కర్ణాటేశ్వరుడైన కృష్ణరాయనృపతి గర్వాగ్నిని నిర్వాపకము గావించినవాడ'ని వర్ణించి యుండవలెను. రాయవాచక, కృష్ణరాయ విజయములు, మనుచరిత్రాది కావ్యపీఠికలు కృష్ణరాయల ఘనతను దెల్పు గ్రంథములుగా, అతడు చవిచూచిన ఒకానొక ఓటమి ఏదైన నున్న దానిని గూర్చి చెప్పట ఔచిత్యభంగమని చెప్పక, విడిచిపెట్టియుండవలెను. కాన కృష్ణరాయల ఈ ఓటమిని గూర్చి ఇంకను బలవత్తరమైన ఆధారములు దొరకువరకు ఇదమిత్థమని చెప్పలేము. అట్టి ఆధారములకై మనము 'విజయనగర సాహి

త్యము నగాక, గజపతుల ఆదరణ క్రింద వారికాలమున, ఓఢ్రదేశమున ఏర్పడిన సాహిత్యమున అన్వేషణ జరుపవలసి యుండును. కృష్ణరాయని కీర్తించుటకు మచ్చువచెనున్న ఈ విషయమునందలి సత్యాసత్యములు చరిత్రకారులు అరయవలసి ఉన్నది.

## అ ధో జ్ఞా పి క లు

1. చూడు. మనుచరిత్ర, 1, 37–39.
వెంకటరమణయ్య, నేలటూరు: కృష్ణదేవరాయలు. (ఆం. ప్ర. ప్రభుత్వము, Archaeological series No. 33, 1972), పు. 61–94 లు; భారతి, సంపుటము 27 (1952) సంచిక 4, పు. 409–415; సంచిక 3, పు. 99–104 లు.

2. ఉదయగిరి శా॥ (నెల్లూరు జిల్లా శాసనములు, III, పు 1367. తిరుమల—తిరుపతి దేవస్థాన శాసనములు. సంపుటము III, సంఖ్య 80 శాసనములు కటకదండయాత్రనుగూర్చి పేర్కొనను.

3. వెంకట రమణయ్య, నేలటూరు : కృష్ణదేవరాయలు, పు 61–94 లు.

4. వెంకట రమణయ్య, నేలటూరు. కృష్ణదేవరాయలు, పు. 74: పు. 88.

5. ఈ శ్లోకమును, Indian Historical Quarterly Vol. XVI, PP. 58—69, శ్రీ దినేశ చంద్రభట్టాచార్య వ్రాసిన "వాసుదేవ సార్వభౌముడు" అను వ్యాసమున ఉటంకించబడినది. నేనీ శ్లోకమును ఈ వ్యాసమునుండి గ్రహించితిని.

6. Sewell : Forgotten Empire, P. 317.

7. కృష్ణరాయ విజయము, III, పద్యములు 97-100.



# స్ఫోటకానికి కాటకం

నూట ఎనభై సంవత్సరాలయింది స్ఫోటకానికి
టీకాల మందు కనిపెట్టి.

ఎనిమిదేండ్ల క్రితం ప్రపంచ ఆరోగ్య సంస్థ వారు
అన్ని దేశాలలో ప్రజలందరికీ సామూహికంగా టీకాలు
వేసే ఉద్యమం ప్రారంభించారు. ఫలితంగా యిప్పుడు
అన్ని దేశాలలో స్ఫోటకానికి కాటకం వచ్చినట్లే.
మన రాష్ట్రంలో కూడా స్ఫోటకం లేదు.
అయినా జాగ్రత్తగా వుండాలి సుమా!

టీకాలు వేయని పసిపిల్లలకే యీ వ్యాధి
ఎక్కువగా సోకుతున్నది.
ఇప్పటికీ పల్లెల్లో టీకాలు వేస్తామంటే
వద్దనే అలవాటు వుంది.

నిప్పులా వ్యాపించే యీ అంటువ్యాధిని అదుపులో
ఉంచాలంటే అందరూ టీకాలు వేసుకోవాలి.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు

No. 14/75

# కృష్ణశాస్త్రి సంపుటాలు

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'కృష్ణపక్షము' 1925లో -యాభయి యేండ్ల క్రితము వచ్చింది. ఆ తరవాత వారి 'ప్రవాసమూ' 'ఊర్వశీ' వచ్చాయి. వారు రేడియోలో పని చేస్తూ, శ్రవ్యనాటికలు చాలా రచించారు. ఈ రోజుల్లో నూ ఆకాశవాణి ఉద్యోగము చాలించు కొన్న తరవాతా సినిమాలకు పాటలు ఎన్నో రాశారు ఎన్నో చిత్రాలకు. రేడియోకి శ్రీ ఆండాళ్ళు అనే నాటిక రాసిన తరవాత ఆ ధన్యజీవి 'తిరుప్పావై' అనే నివేదన కావ్యాన్ని పద్యాలలో—పదాలలో ననవచ్చును—రచించారు. ఈ సై రచనలన్నీ సాగుతూన్న సంవత్సరాలలో, వారికి సహజమైన సౌందర్య రసైక భావన ననుసరించి పద్యాలు-ఖండ కావ్యాలు-రాశారు. వారి కృష్ణపక్ష ప్రచురణకు రజతోత్సవరూపంగా మద్రాసు 'కృష్ణశాస్త్రి సన్మాన సంఘము' వారు వారి రచన లన్నిటినీ 'కృష్ణపక్షము', 'శర్మిష్ఠ', ధనుర్దాసు' 'మేఘమాల' 'తిరుప్పావు' 'పల్లకీ' అన్న శీర్షికలతో ఆరుసంపుటాలు ప్రచురించి ఆంధ్ర సారస్వతానికి గొప్ప సేవ చేశారు. సంపుటాలు ఒకొక్కటి ఎనిమిది రూపాయలు. ప్రాప్తిస్థానము : దేవులపల్లి కృష్ణశాస్త్రి సన్మాన సంఘము, 14 సుంకురామచెట్టివీథి, మద్రాసు; 600001.

1925లో కృష్ణపక్షముతో వెలుగునాట బయటబడ్డ కృష్ణశాస్త్రి తిరుగుబాటుదారు. సంప్రదాయము శిరసావహించిన కావ్యవస్తువూ, వివిధ ఛందోరీతులూ, రచనా చాతుర్య అభిమానమూ పక్కన పారేసి, భావోద్వేగమూ సౌందర్య 'రస'మూ, గీత పద్యముపదములూ స్వీకరించి, సారస్వత సభలలో కావ్యపఠనాలతో తుఫాను లాగ తెలుగుదేశముమీద విరుచుకుపడారు ఆయన. వారి కవిత్వము వల్ల ప్రభావితులై యువకవులెందరో ఊహాప్రేయసీ; ఉదాసీన లోక తిరస్కారమూ, గీతపద్య రచనలూ, కావ్యపఠనాలూ స్వీకరించారు. నాటి తరువాత ఆనాడు ఊహించలేని పరిణామాలు తెలుగు కవిత్వములో వచ్చాయి. ఈ అర్ధశతాబ్ది కాలంలో. సంప్రదాయ కావ్య నియమాలు చిద్రుప చిద్రుపలుగా చితికిపోయాయి, 'పద్యాలు' అన్న పదముమాత్రమే మిగిలింది నాటి కవిత్వ స్మృతిచిహ్నంగా. అప్పటివాలె కవులు తమ రచనలను పాడనూ పాడరూ, చదవనూ చదవరూ; సాగ దీస్తూ స్వరాలురాని దీర్ఘాలు పెట్టి రెండేసిమార్లు గానముచేస్తారు. నాడు కవిత్వము విద్యావంతులకు. నేడు కవిత్వమును వినవలసినవారు కవులే ముఖ్యంగా. కాలేజీ విద్యార్థులు తగుమాత్రం వర్లిస్తున్నారేమో. నాడు భావాలకే ప్రాధాన్యం, నేడు ఊహల అల్లికలకు. నాడు కవనము రంగుల చిత్రము, నేడు రేఖాచిత్రానికే మొగ్గు. ఎన్ని మార్పులు వచ్చినా కవిత్వలక్ష్యము మానవ హృదయమేనవీ, ఆలోచనని కాక భావాలను రేపే రచనే ఏ కాలపు చదువరినైనా పలకరిస్తుందనీ అనిపిస్తుంది నాకు

కృష్ణశాస్త్రి 'సౌందర్యరసైక జీవి' నన్నారు. సౌందర్యాన్ని సానబట్టిన రచన ఎప్పుడూ వాడిగానే వుంటుంది. మనము దానిని ఇదివరకు చదివి ఉండినావరే. కృష్ణశాస్త్రిగారి శారద శర్వరీ మధుర చంద్రికా, సూర్యసుతా స్రవంతికా చారు వీచీవీచికా, మనల్ని నేడు పలకరించకపోవచ్చును గాని, పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గూ, తెలి మబ్బు తెరచాటు చందమామా, ఆగి వినే చిరుగాలి కెరటాలూ, తెమ్మెర త్రోవలో పయనమై పరువెత్తు కోయిలపాటా, శాఖా పత్రములసొ కలో లిసీ తరంగములనో డాగే కమ్మతెమ్మెరలూ, కనులు మూసిన చిరునవ్వు చిలుకుతూ మ్రోల నిలిచే ఆయన ప్రేయసీ, నడిరేని నడిరేయి బడిపోయే ఆమె కడియాల రవళులూ, 'నా కునా దులులేవు నా కుసుమ్ములు రేవు నేను హేమంత కృష్ణాసంతశర్వరిని' అనే విరహి కవి కృష్ణపక్షపు నిశికడుపులో దారలై మెరుస్తూనే ఉంటాయి. భావఖండాల్ని విసరిన కావ్యఖండములేమో గాని. నేలమీదే ప్రారంభమూ చదువరి వేగాన్ని ఇంకా తొందరించే మధ్యమమూ, రెక్కలమర్చిన సమాప్తమూ గల 'అన్వేషణమూ', మాటిమాటికీ', 'పాపీ'. 'దారులన్నియు మాసె', 'నాకుగాదులు' 'నా నివాసమ్ము',

'ఇది నిఘాతము', 'నుసుమబ్బు', వంటి ఖండకావ్యములు ఏ కాలపు చదువరినైనా పలకరిస్తాయి పులకింపచేస్తాయి. అయితే కృష్ణ పక్షము ఆధునిక కవి స్వాతంత్ర్య చిహ్నము. ఆనాటి కవుల గుండె పొంగులన్నీ నంపులు తిరుగుతుని వున్నాయి దానిలో.

కృష్ణశాస్త్రి శ్రవ్యనాటికలు కావ్యాలే. కృష్ణ పక్షపు కావ్య ఖండాల్ని ఖండకావ్యాలుగా తీర్చిన శ్రద్ధ ఆయన నాటికలలో చక్కని కావ్యశిల్పాన్ని తీర్చింది. 'శర్మిష్ఠలో' కచుడు తిరస్కరించిన దేవయాని ఒక విషాద కావ్యము. ఆమె హేమంతంలో సరస్సులాగ నిశ్చల. ఆమె జీవిత కుటీర ప్రాంగణంలో నిలబడిన తొలియవ్వన కాలంలో ఆమె ప్రేమభాండాన్ని 'ఒక' వసంతమూర్తి పట్టుకువెళ్ళిపోయినా ఆమె పడిపోకుండా నిలబడింది. తరవాత ఆమె మంచులో తడిసిన పారిజాతము; లోపల రక్తహృదయమూ పైకి ధవళమూర్తివి. ఆమె హేమంతములాగే వెళ్ళిపోతుంది. మన అనుభవమును దాటి శర్మిష్ఠ నాటికలో. ఆ విషాదపు నిట్టూర్పుమీదనే చిరునవ్వులాగ శర్మిష్ఠ ప్రవేశిస్తుంది. ఆమె మందిరమూ యయాతి ప్రాసాదమూ ఒకదానివైపు ఒకటి చూస్తున్నాయి. అక్కడ నా శరీర సుఖతపస్వి పలితకేశాన్ని చూచి కలవరపడతాడు. అప్పుడు కృష్ణశాస్త్రి—అవును ఈయనే—తన రచనా ఖండాల్ని పాడుకుంటూ కవిగా వస్తాడు. రంగము ఈనాటి కవిసమ్మేళన దృశ్యముమీద పౌరాణికపు వెలుగును ప్రసరిస్తూ సాగుతుంది. కృష్ణశాస్త్రిగారు కవిగా యయాతి మహారాజుకు దొరకగల సౌందర్యాన్నంతా రంగరించుకు అరగించమని వైద్యం చెపుతారు. అదికాక గత్యంతరమేమిటి ? నాలుగోరంగంలో వెళ్ళిపోయే హేమంతపు తాతను గేలిచేసే యువవసంతకులు వసంత వేషంలో వచ్చే యయాతిమహారాజుని స్వాగతిస్తారు. మరకతమ్ముల కుళ్ళాయికి మావిచిగురు తురాయిలో మంయానిల హాయాయి పూన్చిన అరదముమీద ఆమని వస్తుంది. కొమ్మసంపెంగలాగ శర్మిష్ఠ యయాతిపైన ఒరుగుతుంది వసంతయాత్రికుల హర్షిసక కోలాహలాలతో కవిగారి మన్మథాగమన స్వాగతాలతో వసంతోత్సవము సాగుతుంది. యయాతి శర్మిష్ఠలు కలుసుకుంటారు.

నాటకత్వముకన్న — 'కన్న' అనడమేమి. 'కాక' - కవిత్వమే నాట్యము చేస్తున్నది దీన. దేవయాని రక్తహృదయము వసంతానికి దూరమైతే శర్మిష్ఠ యయాతికి చేరువైనది అన్నదే ఇతివృత్తము. వెంకట పార్వతీశ్వరుల ఏకాంతసేవలోని వసంతముకన్న ఈ వసంతము జనసంకులము. అందు మూలాన్న దానివలె ఊహా చిత్రముగానే నిలిచిపోవక రంగప్రసాధనము చేసుకుంది ఈ వసంతము. అయ్యును ఇది ప్రదర్శనమువలె కనిపిస్తుంది. "జంట విడచి తిరగకండి" అన్న హెచ్చరికలో వర్షమువలె ఉండవలసిన మానసాపేక్ష చిన్న ధారగానైనా నడుతోంది. మూడు జంటల గుసగుసలు 'విన' పడవు. వీరి వర్తనమును వేరే గుంపు యయాతితో ఉన్నట్టిది వర్ణించి యుంటే గట్టిగా వినపడియుండును. శర్మిష్ఠా యయాతీ నమావేశం ధామ్మని ప్రవేశించింది. ఇది వారి పూర్వరంగ సమావేశ సహసఫలంగా లేదు. 'నూతిలోనుండి వచ్చిన దేవయాని సౌందర్యాన్ని యయాతి స్మరించడముతో ఆతని హృదయ స్పందనము తెలుస్తున్నది. మధ్యరంగంలోని శర్మిష్ఠకు చైతన్యము చాలదు. విషాద గీతముకన్న వినయోపాలంభనము అవసరము అక్కడ ఇది శ్రవ్య నాటిక కదా ? కవిత్వపు పావురాయియ్యాల వక్షాలయంచుల జాలులో భావాలూ దృశ్యాలూ జిగజిగమంటున్నాయి. కొత్త తేనెతో అడుగులు జారతాయిగా, పొదరిళ్ళలో దూరబోతే పుష్పాళ్ళు కంటపడతాయి. 'నిండి నిండి పువుపువుపువు అనును జుమ్మజాంజుమ్మని తుమ్మెద.' మనుష్యులనూ ప్రకృతినీ మేళవించి వింతైన కవితా చిత్రము రచించారు కృష్ణశాస్త్రిగారు.

'కృష్ణాష్టమి' బాలకృష్ణుడు గోకులానికి వచ్చిన గాథ. దీనిలో వ్యక్తులూ దృశ్యాలూ కనపడతారు. పురిటింటిలో రాధ పాట మొదలుపెట్టే మొహంపెట్టి కనిపిస్తుంది. . కడిమిశాఖ రవంత ఓరగా కనువిరిసి మందిరములోనికి చూస్తుంది. మొదవుల పాలు కనవు వామిని చుట్టి పారతాయి. యశోదమ్మతో పాలకడలి పొంగి ఆమె తెలిరైకా వెలిపె టాతడుస్తాయి. వెదురుపొదలు మోరలెత్తి పాడతాయి. ఒక తలిరుటాకు తుద్దైనా, ఒక లతాగ్రమైనా తల యూపదూ ఊపిరితీయదూ.

అంతా నిశ్శబ్దము. బృందావనము ఏదో నిరీక్షిస్తుంది. తోపులు జపంచేస్తున్నటున్నాయి యమున సైకతవీథికంటె మూగగా ఉంది. నీలగగనాంచలమునుండి నేలపైకి, శ్రావణవలాహక స్నిగ్ధశకలము జారుతుంది పురిటిగిలోంచి రాధ 'శిరో దయమైంది'. అంటుంది. దూరంనించి వసుదేవుడూ అక్రూరుడూవస్తారు.

మూలములో మూగ దృశ్యము ఇక్కడ అక్రూరునివల్ల వినపడుతుంది. ఇది చక్కని శ్రవ్యనాటిక. దృశ్యనాటికకూడానూ యమున ఒడ్డున ఉన్న నందుడి దగ్గరకు రాధ పరుగెత్తుకువచ్చింది యోగమాయ నెత్తుకుని.

ఇక్కడ కవిగారు మనల్ని నెట్టేసి రాధ అయిపోయారు. ఇక్కడ రాధకేమోగాని ఆయనకే తన్మయత్వము వచ్చింది. రాదామరి! వేయబోవని తలుపు తీయమంటూ పిలుపులు. విశ్వవిభుడే రాధను వెతుక్కుంటూ వచ్చాడాయెను శాస్త్రిగారికో ఆయన లేఖినికో మతి తప్పింది యమున దాటివచ్చాయి ఊహలు. వెన్నెలలూ మిను పొనుపూ కరిమబ్బూ గాలుల చామరాలూ తరగలూ కలువలూ అన్నీ చేరేయి. రాధ అందరినీ సర్ది చెప్పింది. 'తమరు పడుకొండి యశోదమ్మగారూ' అని ఆమెకు ఆజ్ఞ పెడుతుంది. 'జయ జయ శ్రావణ జలదేందీవర తరుణ తమాల కిసాల సమాన శ్యామల కోమల చారు శరీరా!' అన్నది. 'అన్నది' ఏమిటే, అన్నారు కృష్ణశాస్త్రిగారు. రాధ ఏదీ? తరవాత ప్రవహించినది కవితా స్రవంతి. గోప కుమారులూ గోపికలూ వచ్చారు. కృష్ణ లీల గాథలు ప్రారంభమై సాగేయి. అప్పుడేనా అంటారా? ''తానే నాకయి స్వామి వచ్చె'' గదా? విశ్వవిభుడే రాధవెంట నంటేరాగ, నాటక మేమిటే నాటిక ఏమిటి? కృష్ణశాస్త్రిగారి కవిత్వమే పొంగింది. అఖిల హరిదంత రాళమ్ము నందు నిండి స్వాంతమందు శరదిందుకాంతివరియె పండె. విశ్వనాథవారి గిరిక అర్పణము చూపితే కృష్ణ శాస్త్రిగారి రాధ ప్రేమతాండవాన్ని చూపింది.

'యమునా విహారి' గోపికలూ కృష్ణుడూ చేసిన యమునా విహారము. క్రిందటి శతాబ్దము చివర 'ఓడపాట' అనే ప్రక్రియ ఇక్కడ మాటలో వచ్చింది. గోపికలు కృష్ణుణ్ణి వెదకి 'పారిజాతం ఒరిగిన పాటిరేవు' దగ్గర చూస్తారు పాడుతూ నృత్యం చేస్తారు. పాటిరేవు అంటే నడిచి యేరుదాటగల రేవు. పడవ నేలకి తగుల్తుంది. శాస్త్రిగారు కృష్ణుని పడవనీ అక్కడికి చేర్చారేలకో? అందరూ ఎక్కితే మరీ తగులుతుంది నేలకి. ఎవరేనా తొయ్యాలి నీళ్ళలోకి. పడవ ఒరిగితే భయమేసే నీళ్ళలోకి ఎవరూ దిగి తొయ్యకుండానే వెళ్ళిపోయింది. 71 ■ పుటలో మధ్యన మరికొన్ని మాటలు రావాలి. "ఒరిగిన కొమ్మల్లో సరంగు చిక్కడతాడా?" అన్నది ఒక గోపిక. ధ్వనికి బలము చాలదు· "కొమ్మలకు గిల్లుకడతాడనా?" అంటే పట్టుకుంటుంది

పడవమీది పాట దూరంతో వెళ్ళిపోతూ వెన్నెలలో కరిగిపోయిందట. ఈ 'వెన్నెల'లో కరిగిపోవడాన్ని రేడియోవారు ఎలాగ చూపించి వుంటారో?

'ఏడాది పొడుగునా' అన్నది ఒక పల్లెలో ఒక కుటుంబంలో ఏడాది కాలంలో జరిగే విశేషాలు. నాటికేమిటీ? రేడియో సంభాషణలన్నీ 'నాటిక'లే. అట్లా అనకపోతే కొత్తపేరు పెట్టుకోవాలి. ఇంటి ఆడుపడుచు తమ్ముడి పెళ్ళికి రావడమూ, నీలాటిరేవుదగ్గర ఆడారచ్చమ్మల గోష్ఠి, పెళ్ళివారు గృహప్రవేశానికి రావడమూ; (పల్లకీలో పెళ్ళికూతురుని తీసుకొచ్చారు శాస్త్రిగారు. అరుగో పెళ్ళివారు రానే వచ్చారు' అని ఒక పేరక్క అనగానే వినపడ పల్లకి పాటలో 'అత్తారింటికి అమ్మోర్ని మొయ్యి' అన్న చివరి మాట వచ్చేదాకా అది ఏం పల్లకీయో తెలీదు. పెళ్ళికూతురు మాత్రం ఇంకా ఏడుస్తోంది:) ఇది ఒక రంగము. తరవాత వానలకోసం ఆదుర్దా, వానకారూ, ఏరువాక, కూలివాళ్ళ పాటలూ, శ్రావణ శుక్రవారపు సందడీ, నాలుక బుజాన్నవేసుకు విహరించే సుబ్బమ్మలూ, పండగ పూజలూ. పురాణాలూ, అల్లుడూ కొడుకూ రావడమూ, చాలా వినిపించారు కృష్ణశాస్త్రిగారు. ఊరిదేవళానికి అన్యాయమే చేశారు. దాన్ని మినహాయించి! పాటలు పొడుగు తగ్గించివుంటే ఒక వీథి నాటకం, దొమ్మరీ, కొమ్మదాసూ, స్వామివారి ఊరేగింపూ పెట్టి ఉండొచ్చు. అయితే వ్యవధి కొంచెమూ, అన్నీ ఎక్కడకనీ? చివర పురోగమనోద్బోధ ప్రారంభించి 'విప్రచివ్వళ్ళం' టూ చిన్నారనుకుంటే మళ్ళీ కవితా సామగ్రి కోయిలలూ గున్నమామిళ్ళూ మలయమారుతాలూ ముసురుకున్నాయి.

'గౌతమి' అన్నది 'ఏడాది పొడుగునా' అన్నదానికి నకిలీలాగ వినబడుతుంది. పేరుకూడా తప్పుడు పేరు పెట్టుకుంది అనిపిస్తోంది. సగలేదు సగందాకా. గభీమని గౌతమీ ప్రళయం వచ్చిపడింది. హరిశాస్త్రి గారి పురాణప్రవచనానికి ఫలశ్రుతిగా వరద రావడము విడ్డూరపు టూహ. తరవాత కథ పాటలాగేసింది. 'వేణుకుంజము' తద్వతే. ఇలాటి రేడియో అవసరనైవేద్యాలు వదిలేసి వుండవలసింది.

'ధనుర్మాసము' ఒరియూరి మల్లుడు రంగనాథస్వామి కన్నులు

చూచిన సుందరగాథ. తన భార్య హేమాంగి కన్నులు చూస్తూ రోజులు గడిపేసే ధనుర్దాసు ఏకాగ్రతను శ్రీరంగదేవుని నేత్రములను చూపి అటు మళ్లిస్తారు ఆచార్యరామానుజులు. రచనంతా ముందు ఏం జరుగుతుందీ ? — అన్న అపేక్షను పెంచి, వివిధ పాత్రల వైలక్షణ్యమును సూచిస్తూ నాటిక అనిపిస్తుంది. ధనుర్దాసు ఉర్లాసి, కృష్ణశాస్త్రిగారిలాగే సౌందర్యరస పిపాసి, భక్తుడు కూడానూ. అంతమాత్రమే కాదు, శాస్త్రిగారికి లాగే (?) ధనుర్దాసుకి ప్రభువంటే భయమూ సంకోచమూ కూడానూ. దేవళంలోకి ప్రవేశించడానికి జంకుతాడు. అయితే అతని ప్రపత్తి ఏ ఆశతోనూ ముడిపడని అర్పణము. [శాస్త్రిగారి శరణాగతి 'నీయిష్టమ్మైనచో నీ కంఠమాలలో మెరసిపోనీవోయి దేవా' అనే పెద్ద ఆశకు ముడిపడినటిది.] ధనుర్దాసు హేమాంగికళ్లంత చక్కనివి ఇంకలేవు అని నమ్మి వాటికోసమే బ్రతికేడు. రామానుజులు అతనిని రంగనాథాలయానికి పిలిపించి 'వాటికన్న చక్కని నేత్రాలు ఉంటే ?' నన్నారు. 'లేవు' అన్నాడు. రామానుజ స్వామికి రంగదేవునిపైననేకాదు, శాస్త్రిగారికి లాగే తనపైనా గాఢ విశ్వాసముంది. ముందు తనవైపు చూడమన్నారుట! అతడు 'తేజస్వి' అని ఉదయమే గుర్తించారాయన, అతని యేకాగ్రతనూ గుర్తించారు. ఆయనదైతే పరమ దాసభక్తి. కాగా ఆయనకు ప్రభువును వేడుకోడమే మిగిలింది, "ధనుర్దాసుకు నీ నేత్రాలు చూపి నన్ననుగ్రహించు ప్రభూ" అని. మరి తనవైపు చూడమనడము దేనికి? 'ఇదిగో ప్రభువు శ్రీపాద తీర్థము పుచ్చుకో' అనియుండవలసినది, "ఒక కను గ్రీష్మ భీష్మకుతపోగ్రతరార్యమ మండలమ్ము...అక్షియుగ్మక మొకసారిగా విరియగా వెరగా ('వెరగు' కాదు 'తడవా' అని యుండవలసినదేమో !) యిక రంగనాయకా" అని ప్రార్థించవలసినది. ఆ తిరునాళ్ల నాటి తపస్వి రామానుజస్వామి. ప్రార్థించకుండానే రంగనాథ స్వామి సాక్షాత్కరించెనా 'అటుచూడు' అని చూపించేయడానికి ? 'యితే, ధనుర్దాసు చక్కని నాటికే. ధనుర్దాసు ప్రార్థనలు ప్రభువు పాదదేశమున బాటి పరమ పావన జాహ్నవీ ప్రతిభగాంచును. 'దయ లేనే లేదటయ్యా' అన్న నిష్ఠురమూ 'నా తండ్రీ! చిరదగ్ధ జాంగలము ప్రాణమ్మిదిగో...' అన్న ప్రార్థనా ధనుర్దాసుది కాదూ కృష్ణశాస్త్రి గారిదీ అంటాను. జాంగలము శాస్త్రిగారి భక్తి కవితాసామగ్రిలోదే? అయినా గొప్పరచనే ఈనాటికా ఈ ప్రార్థనా!

గుహుడు కృష్ణశాస్త్రిగారి భక్తి పూయించిన చల్లని సుగంధరాజము. 'ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి' అన్నమాట కుదా హరణముగుహుడు. ఆయన శ్రీరామచంద్రుని అంతకుముందుచూడలేదు. శివధనుర్భంగమూ పితృాజ్ఞాపాలనమూనే విన్నాడు. స్వామిని గుర్తించుకున్నాడు. ఆ తరువాత గుహుడుగా నిలబడినది శ్రీ శాస్త్రిగారే. "జాహ్నవి నీరములతోడ, సదమలాశ్రు పూరములతోడ కడిగెను మునుగుహుండు. ఆ ర్మనుకుమార సుందరమ్మడుగుదోయి చిన్నెలెన్నండు నిలుచు నీ జీవికవయి?" నన్న ప్రార్థన కృష్ణశాస్త్రిగారిదే కదా! తథాస్తు. 'గుహుడు' రచనలో నిలిచాయి అనవచ్చు! కనుకనే "ఎంత చల్లగ ఎంత హాయిగ పృశించు నా వలచుసామి మృదు కరుణా చరణము! చిరనిదాఘదగ్ధము జర్జరితము జడజాంగలమ్మిది శ్యామల శ్యామలమగు" ననగలిగేరు. తరవాత పలికిన పద్యాలన్నీ ప్రభువు అడుగుదోయిమీదే. ఇక చివ్వరి పద్యంతో "మసక మసక సందె— ఉసురుసురనుగాలి—గంగ జాలిమోత- బెంగవలన డిల్లపడిన పడవ— అల్లన నిలుచుండు ఆ గుహుండు పదియు నాలుగేండ్లు!" అని ఊహను పెంచేసి గుహుణ్ని నిలబెట్టేరు! ఈయన సౌమ్యమేమి పోయిందీ? గుహుడికీ నిషాదులకూ సంభాషణలో పూర్వ రంగమూ, తరవాత శ్రీ రామచంద్రుని ఆగమనమూ, పడవ ప్రయాణమూ, సీతారామలక్ష్మణుల ముందునడకా లేనెదారుల్లో సాగేయి. సుమంత్రుడు శ్రీరాముని దగ్గర సెలవు తీసుకోడమూ గుహుని వీడ్కోలూ తెరవెనకాల జరిపేరు కవి. ఇది శ్రవ్యనాటికా, అవి నిశ్శబ్ద రంగాలూనూ మరి! గుహుడు అహల్యవలె రాయిగట్టేడు రామపాద ధూళిని వలచి !

గుహుడి భక్తి కనటు శాస్త్రిగారిని విడవలేదు. 'శివక్షేత్ర యాత్ర'లో 'అయ్య అడుగు తామరనిండి పొగలేటి స్వర్ణముఖరిమ్మై' ఒళ్లు విరిచి ఒళ్ళు మరచి, కోటయ్య పాటయ్యై వెంటబెటిందు. గుహుడు కోటయ్య అయినాడగా కవిగరు కామశాస్త్రి అయినారు. అందుకే కుక్కుటేశ్వరుడు 'నా అయ్య, నా ఇలవేలుపు నా తల్లి రాజరాజేశ్వరీదేవితో ఓలగమున్న ప్రభువుగా మరి మరీనీ!'

'సాయుజ్యము' అన్నది మహాకవి మేటి కృతు. వారాంగన మల్లాణి. ఆమె కూడా శివభక్తురాలే—ని వలచి వరిపించుకుని తన ఐశ్వర్యమంతా ఆమెకిచ్చి కూర్చున్నకథ మల్లాణి తల్లి ధనగుప్తుని సిరిని కూడా దొరికించుకోడానికని కూతురును అతనిని కూడమంటుంది. మల్లాణి ఇంటినుండి తప్పించుకుని మల్లణ్ణి విజయేశ్వరాలయానికి తీసుకువెళ్లి తానే సర్వమూగా వున్న మల్లణ్ణి మళ్ళీ

స్వామివైపు మరల్చడానికి అతనివైపే చూస్తూ, స్వామి వెనక్కి వెళ్ళి ఆయనలో లీనమైపోతుంది. మల్హణుడు మళ్ళీ భక్తుడౌతాడు. "ఓ పని లజ్జనీ పద పయోజములన్ బడిపోదు, అపయిన్ నాపయి నుంతవంగి, కరుణాపరుణాలయ, నీవు చేతులన్ బాపెదు" అంటాడు స్వామితో మల్హణుడు. 'స్వామీ నీవు నా వాడవు' అనే భక్తి కాబోలిది! మళ్ళీ కండిషనల్ సరెండరే! స్వామి చేతులు చాపుతాడట! ఈయన నెట్లా తెలుసో? శాస్త్రిగారి విశ్వాసము మల్హణ కవికి పట్టింది. "మహతి"లో శాస్త్రిగారి ఆత్మవిశ్వాసము కనిపిస్తుంది. అది చేర్చ లేదేలనో ఈ సంపుటాలలో!

'మేఘమాల' కృష్ణశాస్త్రిగారు 44 సినిమాలకూ రాసిన పాటలు. యతులూ ప్రాసలూ అంత్య అను ప్రాసలూ సంయుక్తాక్షరాలులేని మాటలూ ఆయన చేతి చివరవేకదా? వీటికితోడు నవ కవితా సామగ్రి మబ్బులగుంపులు, తూగే గాలులూ అందెల రవళులు, మా వూరి గుడి, కంటివెలుగు, కొసరుపల్కులు. బ్రతుకు బరువు తీయని కోరికలు, గాలిదారులు అడుగడుక్కీ పలకరిస్తాయి. ప్రకృతి సౌందర్యానికి భావాలద్ది, భావాలకు ప్రకృతి పోలిక లద్ది మన బ్రతుకు బాటలో పర్వమూ దారితోడేనని చూసితే విశ్వమంతా మనయిలే అవుతుందిగదా? ఈ సౌందర్యాన్ని అందిస్తాయి కృష్ణశాస్త్రిగారి పాటలు. "నీ ఇల్లు కొండలో కోనలో, నీ బ్రతుకు ఎండలో వానలో లోకానికే నీవు దూరం, లోకాల తల్లికే భారం" ఒక భావమూ దానిని సులువుగా అందించే రచనా! భావం పలకరిస్తే రచన మెరిపిస్తుంది.

'తిరుప్పావు' ఆండాళ్ళు రచించిన తిరుప్పావై పాటలకు తెలుగు. ఇవి ముప్ఫయి. అన్నమయ్య పదముల ధోరణిలో నాలుగు అయిదు మాత్రల పదములు ఒకపంక్తిగా, నాలుగేసి పంక్తుల చరణాలున్నాయి. ప్రతిపాదానికీ చివరి ఆవృతము అయిదు మాత్రలతో నిండదు. దీనివల్ల పాటలో అక్షరాలే వినబడక కొంత ఊపిరి తిరుగుతుంది. ఇక్కడ శాస్త్రిగారి సాహిత్యానికి సౌభాగ్యవతి అమృతవల్లిగారు స్వరకట్టు ఏర్పరచారు. చరణములలోని చివరిపంక్తులు అనుపల్లవివలె ఉండే అవకాశము లేనిచోట వాటికి వేరే ధాతువు ఏర్పరచారు. సాహిత్యపు పదములు అనుపల్లవిలోకన్న చరణాలలో ఎక్కువైనప్పుడీ అవసర మేర్పడుతుంది. ఒకొక్కప్పుడు రెండో చరణానికీ మూడో దానికీ ధాతువు వేరేవేరే కూర్చవలసివస్తుంది ఇందులోని 17, 22, 26, 29, 30 కీ వలదు వలె కవుల సాహిత్యానికి స్వరము ఏర్పరచ వలసివచ్చినప్పుడీ చిక్కు తప్పదు, వాగ్గేయకారుల రచనలలోని చరణాలకు అన్నిటికీ స్వరము ఒకటే వుంటుంది పల్లవికీ అనుపల్లవికి చరణము చరణానికీ ధాతువు వేర్వేరే అయితే వీటినన్నిటినీ ఒక కీర్తనగా కూర్చడము దేనికని? సాహిత్యము కలిసి వున్నదనా? శ్రీమతి అమృతవల్లిగారు కీర్తనం కన్నిటికీ రాగాలు మార్చి స్వరము ఏర్పరచారూ రక్తిరాగాలు ఇమిడ్చారూ సంభాషణలలో రాగాలు మార్చారు. ఆమె కృషి ప్రశంసనీయము. గోదాదేవి పాటలకు నాటి పద్ధతి సంగీతమే శుభమూ ప్రయోజనకారీనేమో? ఇప్పుడో? ఆమె సాహిత్యానికి అనుసరణ ఆయిన సాహిత్యమది; భాషాంతరీకరణము కాదు. సంగీతము ఈనాటి సంగీతము. పాశురముల సంగీతముకాదు. ఈ రెండింటి మేళనము ఎట్లుండునో వినవలసినదే,

'శ్రీ అండాళ్లు' శ్రవ్యనాటిక, నాటికవలె నడచినది. పాటలూ పద్యాలకన్న సంభాషణ ఎక్కువగా సాగింది దీనిలో. తమ స్వభావము ప్రకారము కృష్ణశాస్త్రిగారీ నాటికలో కేశవుడు అయినారు. వారి సౌందర్య సామగ్రి శ్రావణ వలాహకమూ, కొమ్మ పిల్లగ్రోవులూ కోవెలలూ, వెలది వెన్నెలా, కన్నీరూ, సడిలేని నడిరేయీ, కరిమొయిలూ, అర్థం తెలియని అందాలూ దీనిలోనూ ప్రవేశించాయి. కథ అందరెరిగినదే "చిన్న చిన్న అండాళ్ల సిగదండకోసమై రంగనాథ స్వామి శిరసువంచిన" గాథ.

ఇక మిగిలినది 'పల్లకి'. తిరుగుబాటుదారుగా సౌందర్య రసైకజీవిగా జీవితము గడిపిన కృష్ణశాస్త్రిగారి కోయిలలకారు పోయినా, కపోలము హిమపాండురమైనా వసుధాననము ఉదయ వాసితమే. అమర సీమనుండి అలసానిల వీచికలు వీచినా మధుశాలను కవాట విపాటకుడు మూసినా గులాబి పొదరింటిలో మధుపాత్ర పట్టనుంకించినారు. కొరియా రణమనీ, అణ్వస్త్ర భీకర పరంపర కురిసినారనీ, సంగ్రామము దరియుననీ, వరదలని వరవులనీ, కరవుకాటకములని మరణమని మననమని గగనవాణి వినిపించినా, వినకున్నను తోచకున్నా విన నిష్టపడరు. "ఉండునో ఊడునో మరెపుడో విలయావసరములో బ్రహ్మాండములని (పండుగ) వేడుకలు మానుదురా యిపు డెవ్వరేని" అని సతీమణి హెచ్చరించెనట ఈయనను. అదెంత నిజమో కాని

సంక్రాంతిపేరిట ఢిల్లీ లో జరిగిన దాక్షిణాత్య కవిసమ్మేళనములో తెలుగుకవి సుమకపోలమున తారాలతాంతమాల సమర్పిన ఈ "సంక్రాంతి"పద్యాలు మన గవాక్షవీథులకు గగనవాజీస్యన వీచికల మీద మెత్తని యడుగులతో వచ్చినవి. కలికిపాటల కోయిల కొలము గదా ఈయనది? మెడచుట్టు ముద్దబంతి కడాని యలంకారముతో, పచ్చపచ్చని పైరు పరికిణీ ముడతలలో తోచే సెనగపువ్వులలో చలి కారు ఈదర హుమాయిస్తైన నాటి సంక్రాంతి ప్రాభాతలక్ష్మి 'అధ్యక్షత వహించిన స్వామినాథోపాధ్యాయుని మనఃకపోలమును మెత్తని తెలుగు పలుకుల చేయితో తాకింది. 'సంక్రాంతి ' పద్యాలు చదివే రసికులందరికీ తాకుతుంది.

క్షుద్ర తిత్తిరీ కుటిల వృశ్చికమూ మారణయంత్రమూ అయిన మనిషిలో పెద్దముడతున్నదన్నారు శాస్త్రిగారు. నిజమే. కాని 'బోదెలో ప్రేమయనే పాలు' అలాటి మనిషి ఎలాగ పోయగలడూ? మోడుచేత మందారాలు పెట్టించి జగమంతా పందిరి కట్టించ డానికి శ్రావణవలాహక స్నిగ్ధశకలము జారాలి. అంతవరకూ గుండె సుప్తశిలగ గొంతు చీకటిగా గవాక్షవీథిని ఎదురుచూడవలసినదే. కవులకైతే, 'దవుదవుల పువుదోట కవల (వారికే కనవడే) కోవెలలో గంటలు వినిపిస్తాయేమో ! ఏమొ ?

కనుక 'ఉమర్ ఖయామ' వలె "ఒందు కాచపాత్ర తెందు, అంత నింపుందు దాని వాయిదాక ద్రాక్షరసము ! దాస నన్ను దింపి తక్షణమే బిరడాబిగింపుమోసాకి" అని అన్నవాడే సుఖి గాబోలని పిస్తుంది." పొలిమేరలొకసారి దాటినన్ మోస" మేనేమో ! "పేరాసతె త్రావి నిల్వగలమా కలకాలము మనదు జీవముల్"? నిజమే. అయితే "హవాహుమాయి పయి కుచ్చుపాగాల షోకేలా, పచ్చ జరీబుటా మొఖమలంగీదాల్చి చైత్రుండు" ప్రతినిత్యమూ వచ్చునా? జీవితము "మూల మూలల...తలలెత్తి... హిమవదాంక ములు" "పిలువవా ?" ఒక్క గులాబి తోట విరియోవరి నీడను మరేరు త్రోవరుల్ త్రొక్కనిచోటి లేత చివురుల్" పరిపించామే అనుకో నీకు సెజ్జగా ! "కై పెక్కినదాక త్రావుచు...తుది కన్నుమూతకై" నీవు శయిస్తావు ఖయామ్ !

మేమో ? "దులిపి దులిపిన తరుగదు ధూళి; తుడిచి తుడిచినా ప్రాజాటు విడదు; కోణకోణమున ఇర్సుమూల్గు; పురాణమీ దివాణము". 'ఎటుల పాడుదు మీ బ్రదుకెట్లు పుత్తు' ము?

"నాల్గుదిక్కుల భూభువనమంత లవలేశమును వదలకయె తిరిగి, ప్రతిగేహాగేహాళి పదవాగి, లోనికి జొచ్చి మనలోని స్నేహా క్షీర మొక్కింత ఒలకబోసి, 'అనుగు సోదర మరలిరానా' యని సెలవడిగి సాగిపోయెడు చిరపథికుల" మగుటే కర్తవ్యము. "ఈ మానవుండే నిర్మాత విధాత నేత మరి తానే భోక్త !"

కృష్ణశాస్త్రిగారు కవితా విప్లవ శాలాగ్రముగా ఆనాడు చొచ్చుకుపోయినారు స్వాతంత్ర్యోద్యమ కవితా చిహ్నముగా. వారు అప్పుడు 'నాకుగాదులు లేవు, నాకుషస్సులు లేవు, నేను హేమంత కృష్ణాంతశర్వరిని' అన్నాకొత్తే 'నేను స్వేచ్ఛా కుమారుడ నేను గగన పథ విహార విహంగమపతిని' అన్నాకొత్తే, 'జగమునిండ స్వేచ్ఛా గాన ఝురులనింతు' ననివారు గొప్పలు చెప్పుకున్నా, 'ప్రతి నిశీథ తమంపు కాటుకల చాటు నొరులేరరయలేని లలి, చూచికొని చూచి కొని, శూన్య హృదయములోనికో చెలి యటం చేడ్తును సుమా' అన్నా యువలోకము చెవియొగ్గి విన్నది. నేడో ? ప్రేయసి హాల్సికాలు కావ్యాల్లో, కథల్లో సినిమాల్లో కిక్కిరిసి పిక్కటిల్లినవి. ప్రబంధ వీథులలో ఏనుగంబారిమీద పెండ్లి కోసము వెళ్లె స్వరోచి వసురాజ ప్రభృతులు ఈనాడు బుట్టబొమ్మల వినోదము. 'నిత్యనూతన వసంతములు, యువజీవకాంతులు, వాడని నందన ప్రసనవాటికలూ అప్సరఃస్మితానన మధువాసనా రుచులూ' ఈనాడు షెల్ఫులలోనేగాని సినిమా మాటల్లోకూడా అక్కరలేదు. వీటిని చూపితే ఫాయిడు విజ్ఞాన వెలుగులలో విహరించే యువకులు "ఏమృగతృష్ణనో వలచి యేడ్చెదు వెదుకాడబోయెదేలా మిహికా మృషా పథములన్" అని నవ్వులాడుదురు. "ప్రేయసి సోయగమ్మునకు లేదు శరీరము; లేదు మేను నాటియని ప్రేమ కేని" అనీ ప్రాణసఖుడు పంపిన వలకీలో "మొయిలు నవన ములో ప్రొద్దుపొడుపునగలా" కయిసేసుకుని ప్రణయవల్లకీ పల్లకీలో మధుస్వప్నశాఖలమీదుగా పూలమాలలాగ కూర్చుంటానంటే, 'చిర సౌభాగ్యసిద్ధిరస్తు త్వరగా పోయి రమ్మంటారు. ఏనాడో అడిగేడు పఠాభి: 'ఏదీ వసంతం ? కోకిలారావం బేదీ వినబడలేదే నాకు ?'. అని. చెల్లారామ్ము షాపుముందర వసంతకాలపుటమ్మ కాలనీ ఖరీదుల వరకుడనీవున్న అడ్వర్టైజుమెంటే వసంతాన్ని కనపరిచే పూళ్లు మనవి ! 'సెలయేటి అలలలో కదిలేటి కలువపూ వడవలూ,' 'మంచు జలాన తరపి తేనియసోన తొరసి క్రొవ్విరి గుండెలో కురిపించే' వారూ, 'మసృణకుసుమహృద్ఘనమ్మరంద స్నపిత చరణాలూ, కవులు వారి దంతహర్మ్యలలో నిర్మించుకునే పొగమంచు సామగ్రి. మాయా

మచ్ఛీంద్రగాథవలె ఈనాడు పట్టుకోవ్వూ పలకరించవ్వూ. రవి బింబ పతన దీర్ఘపయోధి గర్వనిర్గత శేష ఫణిఫణారత్న రుచులు కృష్ణ పక్షకాలానికి వచ్చినవా? అలాటివే నేడు "పుత్తడిగిండియ నించి స్వప్నమ్ముల కురిపించే అచ్చరలూ, క్షీరసాగరసుతా ధమ్మిల్ల చేమంతికలూ, ఏలా కల్లోలవతీ (!) వేలావనలోలపవన వీచికలూనూ. వినివిని యున్నమీదట ఇవి చెవికి తగిలీ వినపడవు. "సవనపోన్మిషిత స్వతంత్ర భారత భారతావిరత జనతాజయోత్సవము" అన్నకంటె "లైటు వెలిగించిన స్టేషన్‌లోకి రైలువచ్చినట్టు వచ్చింది కొత్త సంవత్సరము" అంటే తగుల్తుంది. కనక, "ప్రథమ వత్సరాదిని గని వచ్చిన అతిథికి మానవుడిచ్చెనెట్టి స్వాగతము?" అనండి, "తన గళమే కోయిలంగా తన మనసే ఊయెలగా...హాయియె అనుకొనెనా? లేక మాయయె అనుకొనెనా?" అనండి. "మానవుడు మానడు ఆనందోత్సవము, ఆశలు కళ్లెలు లేని గుర్రాలితనికి" అని మనస్సులు జలుమనిపించండి. చక్కగా ఫెలుతుంది.

కవితా సామగ్రి మార్చి కదా మీరు తుపాను హోరులాగ వినబడ్డారూ? "ఏడవలేక, కన్నీరోడువలేక ఆశపడలేక ఆహ్లాదపడలేక, కొయ్యబారాయి ఎద్దు—వీటికి తోబుట్టువైన రైతు"ను చూడండి. అంతేగాని "ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షుని"వలె "అలసి సొలసి వాలెను వరుణావరోధ భామినీ గండ కర్పూర పాళులందు' అని అని వ్రాసి ఈనాడు కొత్తగా ప్రచురిస్తే?! పాతవారి 'లేని మేనక' ఎంత సాటిదో మీ 'శరీరములేని ప్రేయసి సోయగమూ' అంతే! మీరు బాజాపట్టలేదు! షెల్ఫులోని పుస్తకాలు రచిస్తున్నారేమో చూచుకొండి. మేఘము ఎప్పుడూ మేఘమే. 'అప్సరసితావకుంఠనమే' ఎప్పుడున్నూ కాదుగా?

కొనకు "ఈయహంకార మెంతటిదోయి దేవ! నీ చరణ ధూళులకు దిగసేరనేను" అని పలికి, చదువుకొన్నవారమైన మన ప్రపత్తిని చక్కగా—ఉన్నదున్నట్టుగా—వర్ణించారు కృష్ణశాస్త్రిగారు. కాని వారి చూపు, పెరియాళ్వారుల "సురలకేని మునులకేని దొరకరాని పదముల" పై, ఆండాళ్ళతో "పడివడిగ పొలిమేర బడి పారెకును మోసే" అడుగులపై, కవిగా "హిమసా విత పారిజాతము స్వామి పాదపీఠి"ని, మల్లాణుడుగా "సురనారి చరణ పద్మములమీద" గుహునిగా ఆమహాప్రభువు నడిచే ఘంటాపథము, గోపికగా "కృష్ణుని తలిరు పాదములకు ఈయన చలువ కన్నీరు అలరుపన్నీరు". ఈయన ఆ పాదములను వదలిన దెప్పుడూ?

సన్మానసంఘమువారి కృషి ఉదాత్తము దొడ్ల రామచంద్రారెడ్డి మహోదయులు ప్రచురించిన మూడు పుస్తకాలూ వీటికి చేర్చితే కృష్ణశాస్త్రిగారి సాహిత్యము తెలుగువారికి తొంభయి అయిదు పాళ్ళు అందినట్లే. 'మూగవోయిన ఆ గళమ్మునను పరగు నిదురవోవని సెలయేటి రొదలు' ఏవిద్యా సంస్థకేనా చక్కని అలంకారాలూ ఆంధ్ర సాహిత్యాకాశానికి అందవు రాశి

—శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.



# దుర్యోధనుఁ డురగకేతనుఁడా ?

శ్రీ ఏరూరు సీతారామశర్మ

కర్ణాటక విశ్వవిద్యాలయము, ధారవాడలోని సంస్కృత విభాగమునందు ప్రాధ్యాపకులగు శ్రీ డాక్టరు కె. కృష్ణమూర్తిగారు రచించిన 'పంపనిగిద్ద సంస్కృతద హిన్నెలె' యను కన్నడ వ్యాసమునందు దుర్యోధనుని పతాకమునుగూర్చి వ్రాసియుండుటను చూచుట తటస్థించినది. డా॥ కె. కృష్ణ మూర్తిగారి యనుమతితో కొన్ని విషయములందుండి గ్రహింపబడినవి. వారికి నా కృతజ్ఞతలు.

ఉభయకవిమిత్రుని విరాటపర్వము, పంచమాశ్వాసములో నుత్తరున కర్జునుడు కురువీరుల నొక్కొక్కరినిగూర్చి వర్ణించు విధమిట్లున్నది. చూడుడు.

సీ॥ కాంచనమయ వేదికాకనత్కేతనో
జ్జ్వల విభ్రమము వాఁడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగకే
తు ప్రేంఖణము వాఁడు ద్రోణసుతుఁడు
కనక గోవృషసాంద్రకాంతి పరిస్ఫుట
ధ్వజ సముల్లాసంబు వాఁడు కృపుఁడు
లలితకంబు ప్రభాకలితపతాకావి
హారంబు వాఁడు రాధాత్మజుండు

తే॥ గీ॥ మణిమయోరగ రుచి జాలమహితమైన
పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖర ఘన తాళతరువగు సిడమువాఁడు
సురనదీసూనుఁడేర్పడఁ జూచికొనుము॥

తిక్కన్నగారి యీ కేతనవర్ణనములకు మూలమగు వ్యాసభారతమునందీ విధముగనున్నది. చూడుడు..

జామ్బూనదమయీ వేదీ ధ్వజాగ్రే యస్య దృశ్యతే
శోణాశ్వైశ్చ రథే యుక్తైః ద్రోణ ఏష ప్రకాశతే.
ధ్వజాగ్రే సింహలాఙ్గూలో దిక్షు సర్వాసు శోభతే
భారతాచార్య పుత్రస్సోఽశ్వత్థామా విరాజతే
ధ్వజాగ్రే గోవృషో యస్య కాఞ్చనోఽభివిరాజతే
ఆచార్య వరముఖ్యస్తు కృప ఏష మహారథః
యస్య కాఞ్చన కంబూభిర్హస్తి కక్ష్యా పరిష్కృతః
ధ్వజః ప్రకాశతే దూరాద్రథే విద్యుద్ఘనోపమః
ఏష వై కర్తనః కర్ణః ప్రథితానాం ధనుష్మతామ్
యస్య చైవ రథోపస్థే నాగో మణిమయో ధ్వజః
ఏష దుర్యోధనస్తత్ర కౌరవో యశసావృతః
యస్తు శ్వేతావదాతేన పఞ్చతాలేన కేతునా
వైడూర్య మయదణ్డేన తాల వృక్షేణ రాజతే
శీఘ్రశ్చ లఘువేదీ చ లఘు హస్తః ప్రతాపవాన్
ఏష శాన్తనవో భీష్మః సర్వేషాం నః పితామహః

భీష్మపర్వము. అ ౧౭-౧౯

దుర్యోధనుని కేతనమును వర్ణించునప్పుడు మూలమునందు 'నాగో మణిమయో ధ్వజః' అని యుండగా తిక్కన్న 'మణిమయోరగ రుచి జాలమహితమైన పడగవాఁడు కురుక్షితిపతి'యని వర్ణించియున్నాడు. తిక్కన్న యిచ్చటనేగాక మఱి రెండుచోట్ల దుర్యోధనుని కేతనమును ఉరగ పతాకముగనే వర్ణించియున్నాడు. చూడుడు.

(1) "వ॥ వీరలలో నురగ కేతనుండు లేడు. అతండు గోవులం గొని పోవనోపు" విరా. చ 250.

[2] ......"ఇత్తెఱంగున తన చుట్టును బయలైన నయ్యురగ కేతనుండును మఱలె......" (విరా. పం॥ 196.)

వ్యాసభారతమునందు కొన్నిచోట్ల దుర్యోధనుని ధ్వజవర్ణన మీ రీతిగా నున్నది.

(1) జ్వలంతం సూర్యసంకాశం నాగం మణిమయం
శుభమ్. ధ్వజం కురుపతేః......(భీష్మ. 79.15)

(2) తపనీయాంగదం ఛత్రం నాగం మణిమయం శుభమ్.
ధ్వజం కురుపతేః...... (కర్ణ. 51 36)

(3) నాగోమణిమయో రాజ్ఞో ధ్వజః కనక సంవృతః
కింకిణీశత సంహ్రాదో భ్రాజంశ్చిత్రో రథోత్తమమ్॥
(ద్రోణ. 105 26)

(4) మహాన్ దుర్యోధన స్యాసీన్నాగో మణిమయో ధ్వజః
(భీష్మ. 17 26)

పైని కనబరచిన వ్యాసభారతము నందలి ధ్వజవర్ణనము లన్నిటియందును 'నాగ' మను ఉభయార్థక శబ్దమే ప్రయోగింపబడినది. కనుక తిక్కన్న ఉరగపతాకమని వ్రాసినాడు. అతడు పాము అను అర్థమునే స్వీకరించినాడు. కాని సోరెన్సన్‌గారి 'మహాభారత నామ సూచి' యను గ్రంథమునందు, ప్రతాపచంద్రరాయ్, కలకత్తా-వారి మూల భారత ఆంగ్లేయభాషాంతరీకరణమునను సరించి, పై ఉదాహృతములైన నాగధ్వజములకు, ఏనుగు చిహ్నముగాగల జండా యని యర్థమీయబడినది.

మూలభారతమునందీ నాలు ప్రయోగములేగాక మఱియొకటి కూడ గలదు

యస్య నాగోధ్వజా, గ్రో—సౌహేమకేతన సంవృతః
ధృతరాష్ట్రాత్మజః శ్రీమానేష రాజా సుయోధనః॥
(విరా. 55 49)

భాసుని 'ఊరు భంగ' మునందుకూడ వ్యాసుడు ప్రయోగించిన ఉభయార్థక శబ్దమే గలదు. 'నాగకేతుః' అని యున్నది. గుజరాత్ ప్రతియందు 'నాగకేతుః' అను దానికి 'గజధ్వజ' మని యర్థము విచ్చి యున్నారు. నాగశబ్దమునకు గజమను అర్థమును చెప్పుటకొక కారణమున్నదని యూహింపవలసి యున్నది. వ్యాసభారతమునందు, భాషాంతరీకరించిన అన్ని భాషలలోని భారతములందు హస్తినావతి పట్టణమునకు నాగపురమని, కరినగరమని, గజపురమని చెప్పి యుండుటను గమనింపవచ్చును. నాగపురమునకు కరిపురమని ఏనుగు అర్థము వచ్చునటు చెప్పినప్పుడు, నాగధ్వజమునకు ఫణిరాజ కేతన మని యర్థము చెప్పకొనుట కేమి హేతువు అనునది విచారింపవలసి యున్నది. తిక్కన్నగారి యురగ ధ్వజమునకు మూలమేదై యుండును?

నాకు దోచినంతవఱకు సమాధాన మిట్లుండును.

కన్నడ భాషలో నాదికవి యగు పంపడు దుర్యోధనుని ఫణీంద్ర కేతనుడని, ఫణికేతనుడని, ఫణిరాజ కేతనుడని, పన్నగ కేతనుడని చాలసారు వర్ణించియున్నాడు. ఒకటి రెం డుదాహరణముల మాత్ర మిచ్చట చూపుచున్నాను.

(1) 'నిన్నుత్పత్తి యనిం తెం
దెన్నరు మణమఱియఱి నినాం సహదేవం
పన్నగకేతు దినేశం
విన్నంబిరె కుంతి యింతివర్ నెఱ బలరో॥'

పంప. ౯-౭౨.

ఈ పద్యమునందు శ్రీకృష్ణుడు కర్ణునితో నతని జన్మవృత్తాంతమును గూర్చి పల్కిన సందర్భము గలదు. నీ జన్మమును గూర్చి ఇట్టిదని యెవరికిని కొంచెమైనను తెలియదు. నేను (కృష్ణుడనైన నేను) సహదేవుడు, పన్నగకేతు (అనగా దుర్యోధనుడు) సూర్యుడు, నీ తల్లియైన కుంతీదేవి—వీరలకు మాత్రము తెలియును. అని కృష్ణుడు పల్కు సందర్భమున పంపకవి దుర్యోధనుని 'పన్నగకేతు' అని వర్ణించియున్నాడు.

(2) నెగెయెపొదళ్ద బొబ్బుళి కెగళ్ నెగెదెంతెరడుం కెలక్కెనీ
రుగియెగదాభిఘాతపరిపూరితతోయజషండమలి గ
ల్లిగె కదడెళె భీమ భుజమందర ఘట్టనెయింద మల్లి తొ
ట్టగె కొళెకాళ కూట మొగెనంతొగెదం ఫణిరాజ కేతనం.

పంప. ౧౩-౯౨.

ఈ పద్యము భీమదుర్యోధనుల గదాయుద్ధప్రారంభమును గుఱించి చెప్పుచున్నది. దుర్యోధనుడు హ్రదమునుండి బయటికివచ్చినాడని చెప్పుచు అతడు భీమగదాభిఘాతమువలన పాయలైన నీటినుండి బయటికివచ్చెనని, కవి యీ విషయమును ఉపమానమునిచ్చి వర్ణించి

యున్నాడు. భీముని భుజమును మందర పర్వతపు ఘట్టనము వలన కాలకూట విషము పాలసముద్రమునుండి పైకి వచ్చినటు దుర్యోధనుడు హ్రదమునుండి బయటికివచ్చెను. కాలకూట విషము,—ఫణిరాజ కేతన పదప్రయోగములచే కవి దుర్యోధనుని శీలమును చెప్పక చెప్పుచున్నట్టున్నది.

మూలమునందు వ్యాసమునీంద్రుడు 'నాగోమణిమయ ధ్వజః' అనుదానికి పంపకవి పామను అర్థమునే గ్రహించియున్నాడు. కన్నడ కవి రత్నత్రయములో రెండవవాడగు రన్న మహాకవి తన 'గదా యుద్ధ మునందు దుర్యోధనుని 'ఉరగపతాకం', 'దందశూక పతాకం' అని వర్ణించియున్నాడు. వీరి రచనల నాధారముగా గైకొని కాలోలు కుమారవ్యాసుడు కూడ 'అగిప హావిన హాళవిగెయ......' మున్నగు ప్రయోగములను చేసియున్నాడు. దీనివలన కన్నడ కవులు నాగ శబ్దమునకు పామను అర్థమును చేసినారనుట స్పష్టము.

తమిళ భారత రచయితలు కూడ సర్పార్థమునే గైకొనిన ట్లున్నది. విల్లిపుత్తూరు భారతమునందు దుర్యోధనుడు సర్పధ్వజుడుగానే వర్ణింపబడియున్నాడు. 'అణివహూప్పసరుక్కమ్' యిత్యాదులు. దుర్యోధనుని సర్పధ్వజము, శ్రీకృష్ణుని గరుడధ్వజమునకు వెఱచి వెనుకకు పారిపోవుచున్నట్లున్నదని తమిళకవి యుత్ప్రేక్షించినట్లున్నది.

తిక్కన్న పంప రన్న కవులకంటె తరువాతివాడు. కన్నడ కవుల సర్పధ్వజ ప్రయోగమాతడు చూచియుండకపోడు. కనుకనే వారివలెనే యీతడుకూడ ఉరగపతాకమనియే వర్ణించినాడు.

దాక్షిణాత్యులగు తమిళ, కన్నడ తెలుగు కవులు తమభాషలందు భారతమును వ్రాయునప్పుడు వ్యాసమహర్షి నాగ శబ్దమునకు పామను అర్థమునే చేసియున్నారు. కాగా దక్షిణ భారతమునందలి కవులందరు సర్పార్థమునే గైకొనుటలోగల విశేషమేమి ? అను ప్రశ్న రావచ్చును. దానికి సమాధానముగా దుర్యోధనుని ఫణిశీలము, ప్రతీకారబుద్ధి, మొదలైన మనోగత ధర్మములను బాహిరముగా సూచించుటకుగాను అతని కురగ కేతనత్వ మాపాదింపబడినదనవచ్చును. ఇట్లు భావించినచో మఱియొక చిక్కులోబడగల సవకాశమున్నది. చూడుడు. శ్రీకృష్ణుని గరుడధ్వజమునకు. అర్జునుని కపిధ్వజమునకు. ద్రోణసుతుని సింహలాంగూల ధ్వజమునకు ఉచితమైన యర్థములను కల్పించి వారి మనోగత ధర్మము లీ యర్థములచే భాసింప గలవని చెప్పగలుగుటకు వీలుండునా ? యను సందేహము రాక మానదు. అయినను నిజమేమనగా వేదవ్యాసు డే ధ్వజము లెవ్వరికని నిర్దేశించినాడో. వానినే తమ తమ భాషలయం దనువదించునప్పుడు పేర్కొనుట జరిగినది. కాని యుభయార్థకమగు శబ్దప్రయోగము సంస్కృతభారతమునందు జరుగగా దాక్షిణాత్యు లందరూ సర్పార్థమువే గైకొని యున్నారు.

దాక్షిణాత్యులకు సర్పార్థము ననుసరణముగా దోపగా నుత్తర దేశ కవులు నాగశబ్దమునకు గజార్థమును చెప్పుకొన్నట్లు గనబడుచున్నది. చతుర్భుజ మిశ్రపండితుడు, మూలభారతమునుండి పై నుదాహరించిన శ్లోకములందలి నాగశబ్దమునకు—నాగో—హస్తీ, కేతనం పతాకాయని స్పష్టీకరించియున్నాడు. ఈ యర్థమే సమంజసమని యూహించుకొనుటకుగల ప్రబలహేతువేమనగా వ్యాస భారతమునందు 'కింకిణీశత సంహ్రాదో...'యని యుండుటయే. కింకిణులచే సర్పముల కలంకరణముచేయు టూహాకందని విషయము. లేదా కింకిణులచే నలంకరించుకొనుటకు సర్పములకంటె గజములకే అవకాశ మెక్కువగలదనుటలో సత్యమున్నదని చెప్పవచ్చును. కనుకనే ఉత్తర దేశీయుల గజార్థము సహేతుకముగా నున్నట్లు కనబడుచున్నది. ఇంక కొంత విచారించినచో, యీనాటికి ఘూర్జరదేశమునందును. బంగాళమునందును, దుర్యోధనుని ధ్వజము హస్తిధ్వజమనియే ప్రతీతి యని తెలియుచున్నది. ఈ యభిప్రాయమును బలపరచుటకొక యాధారమున్నది. మన్మథనాథదత్త, పి. సి. రాయ్ యనువారిరువురు భారతము నాంగ్లేయభాషయందనువదించుచు, నాగశబ్దమునకు (Elephant) ఏనుగును అర్థమునే వ్రాసియున్నారు. కాగా నుత్తరదేశమునందు నాగధ్వజమునకు గజపతాకమనియు, దక్షిణమునం దురగపతాకమనియు వర్ణనములు కల్పింపబడినవనుట స్పష్టము కాని కన్నడ భారతములందనగా పంపభారతమునందు. రన్నని గదా యుద్ధమునందు గనపడు కొన్ని పద్యగద్యములనుబట్టి గజపతాకమే యర్థవంతమైనట్లు దోచును. చూడుడు. పంపని విక్రమార్జున విజయమునందలి యీ వచన భాగమును గమనింపుడు. "... ... ... ... నిజపతాకినియ నడువె మెఱెవ పతాకా విరాజమాన మన్న తమ్మణ్ణన రథమంకాణదె కౌరవ బళజలనిధియొళ్ బళ్ళళబళ దొగెదకేసరియంతె తల తలిసి మిళర్ల్ పవనతనూజన కేసరి కేతన మప్పళిమిగె యంకందు ముట్టి......" ఇక్కడ పవనతనూజు

నకు (భీమునకు) కేసరి కేతనము కలదని చెప్పబడినది. పంపకవి ననుసరించి కాబోలు రన్నకవి తన గదాయుద్ధమున నొకచోనిట్లను చున్నాడు చూడుడు.

కం॥ దెసెదెసెవళ్గె జపా
ప్రసూన మం రక్త బలియుమంతాంకుదు వం
తెసెదిరల్ లోకదెగణ్గె
కేసరి పెకదు గెంపు సింహభుజగధ్వజరా.

అశ్వా. ౮ పద్య ౭.

ఈ పద్యము, భీమదుర్యోధనుల యుద్ధమును వర్ణించునదియై యున్నది. సింహధ్వజుని (భీముని) భుజగధ్వజుని (దుర్యోధనుని) కన్నులనుండి రక్తకాంతులు అన్ని దిక్కులందు వెలసి, రక్తపుష్పోప హారమును, రక్తబలి నర్పించు నటులుండెనని కవి వర్ణించి యున్నాడు. ఇక్కడ భీముడు సింహధ్వజుడుగ జెప్పబడియున్నాడు రన్నడుపయోగించిన సింహధ్వజము పంపనినుండి గ్రహింపబడినదని వేరుగ జెప్పనవసరములేదు. పై నుదాహరించిన కన్నడ కావ్యము లందు కనపడు భీముని సింహధ్వజమునుబట్టి, నాగధ్వజ విష యమునను దూహ చేయుట కవకాశము కలుగుచున్నది

భీమ దుర్యోధనుల వైరము ప్రసిద్ధమైనదిగదా! అట్లే సింహగజవైరము కూడ ప్రసిద్ధమైనది. సింహ నాగధ్వజములు వారి వైరమును తెలుపగలవని యూహించినప్పుడు నాగశబ్దమునకు ఏనుగను అర్థమునే చెప్పవలసియుండును అటుల చెప్పుటవలన ఔచిత్యమును పాటించినటులగును

కాని యొక సందేహము కలుగకపోదు. భీముని సింహధ్వజ వృత్తాంతము కన్నడ కవులు మాత్రము తెలిపియున్నారు. వారట్లు రచించుట కేది యాధారమో తెలియుటలేదు వ్యాసభారతమునందు భీముడు కేసరి కేతనుడుగా చెప్పబడినటులేదు: పెద్దలు వ్యాస భారతమును చూచి నిర్ణయింపవలెను. ఈ సందర్భములో శ్రీమ దానంద భగవత్పాదాచార్యులవారి భారత తాత్పర్య నిర్ణయమును కూడ పరిశీలించుట జరిగినది. వారు మూడవతారము లెత్తిన వారని ప్రతీతి. హనుమ, భీమ, మధ్వ యను అవతార త్రయము కలవారు. వారి గ్రంథమునందు భీమునకు సింహధ్వజమున్నటులు కనబడదు.

'కింకిణీ శత సంనాదో' యని వ్యాసభారతము నందున్నది కాబట్టి, పాముకంటె ఏనుగునకే కింకిణ్యాలంకరణ ముచితము కాబట్టి, కన్నడ కవులు భీమసేనుని ధ్వజమును సింహధ్వజముగా పేర్కొన్నారు కాబటి యిప్పటికి దుర్యోధనుని గజధ్వజుడని పేర్కొను టుచితమగుచున్నది. అట్లగుచో దాక్షిణాత్యుల సర్పధ్వజ ప్రయోగము సంపూర్ణముగా సత్యవంతమైనది కాదనియు. ఉత్తర దేశ కవుల గజార్థము సమీచీనమైనదనియు భావించుటలో తప్పుండదు

పరిశోధకు లెవ్వరైన దీనిని నిర్ణయింపగలిగినచో చాల సంతోషము.



దక్షిణ భారత చరిత్ర చతురాస్యులు

# నీలకంఠశాస్త్రిగారు

## శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు

చరిత్రకే జీవితాన్ని అంకితం చేసి చరిత్ర పరిశోధనమే తమ జీవిత లక్ష్యంగా నడచిన చారిత్రక తపస్వులు భారతదేశంలో సువర్ణాక్షరాలతో లిఖింపతగినవారు ఆర్. జి. భండార్కార్, ఆర్. కె. ముఖర్జీ, జాదూనాథ్ సర్కార్, కె. ఎమ్. పణిక్కర్, సర్దేశాయ్, ఆర్. సి. మజుందార్, హెచ్. సి. రాయ్ చౌధురి, ఈశ్వరీ ప్రసాద్ మున్నగువారున్నారు. అట్టి ప్రధాన చారిత్రక తపస్వుల కోవలోనివారు శ్రీ నీలకంఠశాస్త్రిగారు.

శ్రీ కల్లిడైకురిచి అయ్యా అయ్యర్ నీలకంఠశాస్త్రిగారు 1892 ఆగస్టు 12 వ తేదీని మద్రాసు రాష్ట్రంలోని తిరునల్వేలి జిల్లాకుచెందిన "కల్లిడైకురిచి" గ్రామంలో ఒక అతిసామాన్య కుటుంబంలో జన్మించారు. వారు ప్రాథమిక విద్యనంతా స్వగ్రామంలో అభ్యసించి; ఉన్నత విద్యకొఱకు మద్రాసు చేరారు. అసంఖ్యాకులైన విద్యార్థులను మేధావులుగాను, బహుముఖ ప్రజ్ఞావంతులుగాను తీర్చిదిద్దిన మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో శాస్త్రిగారు తమ బి. ఏ; ఎం. ఏ. పట్టాలను గైకొన్నారు. వారు ఎం. ఏ. పట్ట పరీక్షలో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులవడమే కాకుండా, మద్రాసు ప్రెసిడెన్సీ అంతటిలో ప్రథములుగా ఘనవిజయాన్ని సాధించారు.

శాస్త్రిగారు 1913 లో ప్రప్రథమంగా తిరునల్వేలిలోని హిందూ కళాశాలలో చారిత్రకోపన్యాసకులుగా తమ ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించారు. ఐదు సంవత్సరాల తర్వాత వారు 1918 లో కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిని అలంకరించారు. 1920 లో వారు చిదంబరంలో శ్రీ॥ శ్రీ॥ అన్నామలై చెట్టియార్‌చే స్థాపింపబడ్డ "మీనాక్షి కళాశాల"కు ప్రధానాచార్యులుగా నియమింపబడ్డారు. తరువాత కొంత కాలానికి ఆ కళాశాల అన్నామలై విశ్వవిద్యాలయంగా రూపొందింది. 1929 అక్టోబరులో వారు మద్రాసు విశ్వవిద్యాలయంలో భారతదేశచరిత్ర పురావస్తుశాస్త్ర శాఖలకు అధ్యక్షులుగా నియమింపబడ్డారు. స్వాతంత్ర్యసిద్ధి వరకు వారాపదవిలోనే ఉన్నారు. ఆకాలంలో వారు "విజిటింగ్ ప్రొఫెసర్" గా అనేక ప్రాచ్య, పాశ్చాత్య విశ్వవిద్యాలయాలను సందర్శించారు. 1952 నుండి 56 వరకు వారు మైసూరు విశ్వవిద్యాలయంలోని "ఇండాలజీ" విభాగానికి అధిపతిగా నున్నారు. వారాపదవిలోనున్న కాలంలో మలయా విశ్వవిద్యాలయం "ఇండియన్ స్టడీస్" విభాగాన్ని స్థాపించడం, దాని స్థాపనలో శాస్త్రిగారు విశ్వవిద్యాలయాధికారులకు ఎంతగానో తోడ్పడడం జరిగింది. మద్రాసు విశ్వవిద్యాలయ సహకారంతో యునెస్కో స్థాపించిన ఆగ్నేయాసియా సంప్రదాయ సంస్కృతుల సంస్థకు (1957) నీలకంఠశాస్త్రిగారు డైరెక్టరుగా నియమింపబడారు. వారు ఆ హోదాలో అనేక ప్రపంచ దేశాలను సందర్శించారు. 1971 వరకు వారాపదవిని మంచి సామర్థ్యంతో నిర్వహించారు. వారనేక రంగాలలో గావించిన కృషి, అపార చారిత్రక పరిశోధనను గుర్తించి భారతప్రభుత్వము 1958 లో వారిని "పద్మభూషణ్" బిరుదంతో సత్కరించింది. అనేక పదవులను చేపట్టి, అనేక సన్మానాలను, బహుమానాలను గ్రహించి సహస్రమాసజీవియై తుదకు వారు 1975 జూన్ 15 వ తేదీని మైలపూర్‌లోని తమ స్వగృహంలో తనువు చాలించారు. అనాయాస మరణం, అదైన్య జీవితం వారికి లభించాయి.

శాస్త్రిగారు ప్రముఖ భారతీయ చారిత్రక, ప్రాచ్య సాంస్కృతిక సంస్థలైన "ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్", "ఇండియన్ హిస్టారికల్ రికార్డ్స్ కమిషన్", ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్"లతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండేవారు. శ్రోతలకు చారిత్రక పరిశోధనలో జిజ్ఞాస కలిగేటట్లు వారి ఉపన్యాసాలు

వార్షిక సమావేశాలలో సమర్పించిన పరిశోధనా వ్యాసాలు గణనీయమైనవి. 1946లో పాట్నాలో జరిగిన "హిస్టరీ కాంగ్రెస్"కు వారు అధ్యక్షత వహించారు.

దేశంలో పేరెన్నికగన్న ఆచార్యులలో నీలకంఠశాస్త్రిగారొకరు. వారు శిష్యవత్సలులు. శాస్త్రిగారు తమ చారిత్రక విషయ పరిజ్ఞానంతో, వాగ్విన్యాస వైఖరితో, అఖండ భారతలో సుమారు 40 సంవత్సరాలు శిష్య హృదయాలను రంజింపజేసిన మహనీయ మూర్తి. దక్షిణ భారత విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను వారి శిష్యులనేకులు ఈనాడు వ్యాపించియున్నారు.

చరిత్రకారుడు తనకు లభించిన చారిత్రకాధారములతో పక్షపాత రహితంగా చరిత్ర రచన సాగించాలి. తన మనస్సులోని భావాలు, అభిప్రాయాలు చరిత్ర రచనలో జొనిపించకుండా ఉన్నది ఉన్నట్లుగా చరిత్రకారుడు చిత్రించాలి. తన—పర అన్న భేదం లేకుండా, నిర్మమతతో, విషయాన్ని యథార్థ ప్రదర్శన దృష్టితో లోకానికి అందించాలనేదే చారిత్రకుని ప్రధానలక్ష్యం. గతాన్ని రాబోయే దానితో వేర్వేరుగా అనుసంధించే సేతువే చరిత్రకారుడు. ఈ లక్ష్యాలకు ప్రతిరూపాలుగా నిలిచిన బహుకొద్ది మంది భారతీయ చరిత్రకారులలో నీలకంఠశాస్త్రిగారొకరు.

దక్షిణ భారత చరిత్రను పరిశోధించిన చారిత్రకులను పేర్కొనేటప్పుడు ప్రప్రథమంగా శాస్త్రిగారిని పేర్కొనాలి. వారి అపార చారిత్రక పరిశోధనలో నాల్గింట మూడువంతులు దక్షిణ భారతాన్ని పాలించిన రాజవంశాలపైన, ఆగ్నేయాసియాదేశాల "మత సంస్కృతులపై దక్షిణ భారతదేశ ప్రభావము", అను విషయంపైనను సాగింది. శాస్త్రిగారి రచనలన్నీ ప్రమాణంలోను, పరిమాణంలోను ఉత్తమ గ్రంథాలుగా పన్నెగాంచాయి.

"ది చోళాస్" అను శీర్షికతో రెండు సంపుటాలు, "స్టడీస్ ఇన్ ది చోళా హిస్టరీ అండ్ అడ్మినిస్ట్రేషన్" అనేది శాస్త్రిగారి తొలి చారిత్రక పరిశోధనా ఫలాలు అని చెప్పవచ్చు. మౌలిక చారిత్రక ఆధారమును బాగుగా పరిశీలించిన పిదప రచించబడిన యీ గ్రంథములు శాస్త్రిగారిని దక్షిణ భారత చారిత్రక మండలంలో లబ్ధప్రతిష్ఠులను చేశాయి "ది పాండ్యన్ కింగ్డమ్" అను పరిశోధనా గ్రంథము చారిత్రకులుగా వారి కీర్తిని ఇనుమడింపజేసింది. శాస్త్రిగారి గ్రంథములలో ప్రఖ్యాతి నందినది. విశాల వ్యాప్తి పొందినది— "ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా" చారిత్రకులకు, చారిత్రకులు కాని వారికి అర్థమయ్యేరీతిగా సులభ శైలిలో రచింపబడిన గ్రంథమిది. అత్యంత ప్రాచీన కాలమునుండి విజయనగరరాజులు, బహమనీ సుల్తానుల చరిత్ర వరకు దక్షిణ భారత రాజవంశాల చరిత్ర—సంస్కృతి సంక్షిప్తంగా నిందు వివరింపబడింది. దక్షిణ భారత చరిత్రకిది ప్రమాణగ్రంథమనడంలో ఎట్టి సందేహం లేదు.

శాస్త్రిగారు ప్రకటించిన ప్రధాన గ్రంథాలలో "ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర హిస్టరీ" ఒకటి. డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారితో కలిసి వారీ గ్రంథాన్ని ప్రకటించారు. 1929లో డాక్టర్ ఎస్ కృష్ణస్వామి అయ్యంగారు 'సోర్సెస్ ఆఫ్ విజయనగర హిస్టరీ అను గ్రంథాన్ని ప్రకటించినా "ఫర్దర్ సోర్సెస్" అనే శాస్త్రిగారి గ్రంథం బాగా విస్తృత పరిధిలో విజయనగర చారిత్రకాధారములను చర్చించిన గ్రంథం.

"ఫారిన్ నోటీసెస్ ఆఫ్ సౌత్ ఇండియా" అనే గ్రంథం శాస్త్రిగారి గణనీయమైన రచనలలో నొకటి. ఇందు దక్షిణ భారత దేశమును సందర్శించి విదేశ రాయబారులు, విదేశ యాత్రికులు దక్షిణ భారతదేశమును గూర్చి చెప్పిన అనేక విషయములిందు వివరింపబడ్డాయి. మెగస్తనీస్ నుండి మాహువాన్ వరకు విదేశీయులు దక్షిణ భారతమును గూర్చి నుడివిన మాటలిందుదాహరింపబడ్డాయి.

'దూర ప్రాచ్యదేశాల మత, సంస్కృతుల పై దక్షిణ భారతముయొక్క ప్రభావము' అను విషయంపై విస్తారమైన పరిశోధన గావించిన ప్రముఖులలో నీలకంఠశాస్త్రిగారు ప్రథమగణనీయులు. "సౌత్ ఇండియన్ ఇన్‌ఫ్లుయన్స్ ఇన్ ది ఫార్ ఈస్ట్" "హిస్టరీ ఆఫ్ శ్రీవిజయ" అనే గ్రంథాలు పై విషయంపై శాస్త్రిగారు జరిపిన పరిశోధనా ఫలితాలు. శ్రీవిజయ రాజ్య చరిత్రపై పరిశోధన జరపడానికి శాస్త్రిగారు హ్యూగో రచించిన "సెల్ఫ్‌టాప్ సిరీస్"లో డచ్, ఫ్రెంచి భాషా వాచకాలను చదివి, స్వయంగా భాషలను అధ్యయనంచేసి ఆ గ్రంథాన్ని వ్రాసినట్లు శాస్త్రిగారే చెప్పారు!

శాస్త్రిగారి ముఖ్య సంపాదకత్వంలో భారతదేశ చరిత్రకు సంబంధించిన రెండు బృహత్ గ్రంథాలు వెలువడ్డాయి. అవి

"కాంప్రెహెన్సివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా"గా "ఏజ్ ఆఫ్ నందాస్ అండ్ మౌర్యాస్" "కాంప్రెహెన్సివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" అనే శీర్షికతో 12 సంపుటాల భారతదేశ చరిత్ర విస్తృత పరిధిలో ప్రకటించాలని "ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్" సంకల్పించింది. కొంతకాలం తర్వాత అది "భారత ఇతిహాస్ పరిషత్" ప్రారంభించ తలపెట్టిన 20 సంపుటాల భారత చరిత్ర ప్రణాళికలో కలిసి పోయింది. కాని దురదృష్టవశాత్తు రెండు సంపుటాలు ప్రకటింప బడిన తర్వాత ఆ ప్రణాళిక నిలిచిపోయింది. నీలకంఠశాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడ్డ రెండవ సంపుటం 1957లో ప్రకటింపబడింది [2]

విద్యార్థులకు వినియోగపడేటట్లు వారు కొన్ని గ్రంథాలు ప్రకటించారు. అందు "హిస్టరీ ఆఫ్ ఇండియా" "హిస్టారికల్ మెథడ్ ఇన్ రిలేషన్ టు ఇండియన్ హిస్టరీ" "సోర్సెస్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" అను గ్రంథాలు ప్రధానంగా పేర్కొనవచ్చు.—

'హిస్టరీ ఆఫ్ ఇండియా' అను గ్రంథం మూడు సంపుటాలుగా వెలువడ్డది. పట్టపరీక్షకు చదివే విద్యార్థులకు వినియోగపడేటట్లు దానిని శాస్త్రిగారు రచించారు. 'హిస్టారికల్ మెథడ్' ను వారు శ్రీ హెచ్. ఎస్. రామన్నగారితో కలిపి ప్రకటించారు. పోస్ట్ గ్రాడ్యుయేట్ చరిత్ర విద్యార్థులకు అత్యంత ఉపయుక్తమైన గ్రంథమిది. ఈ గ్రంథం చివరిలో ఇవ్వబడిన ప్రసిద్ధ చరిత్రకారులను గూర్చిన సమాచారము చాలఉపయోగమైనది. "సోర్సెస్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" అనేది "హీరాస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ అండ్ కల్చర్" ఆధ్వర్యానంలో 1961 లో బొంబాయిలో ప్రసంగించిన హీరాస్ స్మారకోపన్యాసాలు. ఇవి మూడు ఆసియా పబ్లిషింగ్ హౌస్ వారిచే గ్రంథరూపంలో ప్రకటించింది.

ఈవిధంగా నీలకంఠశాస్త్రి గారనేక ఉత్తమ విద్యార్థులను తయారుచేసిన ఆచార్యోత్తములుగాను, ఉత్తమశ్రేణి చారిత్రకులుగాను ప్రఖ్యాతినందారు. ప్రాచీన భారతదేశ చరిత్రకు ఆర్. జి. భండార్కర్‌లా, మధ్యయుగపుచరిత్రకు ఈశ్వరీ ప్రసాద్‌లా, మొగలు చరిత్రకు జాదూనాథ్ సర్కార్‌లా, మహారాష్ట్రదేశ చరిత్రకు సర్ దేశాయ్‌లా, ఆంధ్రుల చరిత్రకు సోమశేఖరశర్మగారిలా, దక్షిణ భారత చరిత్రకు నీలకంఠశాస్త్రిగారి పేరు చెప్పిన తర్వాతనే ఇతరుల ప్రసక్తి తీసుకురావాలి. ప్రకృతి ధర్మంవల్ల భౌతికంగా తనువు చాలించినా వారు తమ రచనలలో శాశ్వతంగా జీవించిఉంటారు. ఆయన మృతజీవులు. ఆయన మూర్తి, కీర్తి కాయంతో భారతదేశంలో నిత్య విహారం చేస్తూనే ఉంటుంది.

1. Sowrcas of Indian History—Page 12
2. do do —Page 9



# కలగూరగంప

## డబ్బూ - దస్కం

'డబ్బు' అనే పదానికి జంటపదంగా 'దస్కం' అనేపదం వాడుకలో వుంది. యీ 'దస్కం' అనే పదం భాషలోనైనా 'డబ్బు' అనే అర్థంగల పదానికి వికృత రూపంలా కనిపించదు. మరి యీ 'దస్కం' అనే పదం ఎలా వచ్చింది ?

నా వూహ చెబుతాను.

ప్రాథమిక పాఠశాలల్లో పిల్లలకి 'తీసివేతలు' (subtractions) చెబుతారు. పైనున్న అంకె క్రిందనున్న అంకెకన్నా చిన దయినపుడు ప్రక్క స్థానంలోనించి పది 'అప్పుతెచ్చుకో' మంటారు. ఈ అప్పు తెచ్చుకోడానికి రాయలసీమ ప్రాంతంలో 'దశకం' తెచ్చుకోవడం అంటారు దశకం అన్నా పదేగదా ! భౌగోళికంగా యీ 'దశకం' అనే వ్యవహారం ఆగిపోయి 'అప్పు తెచ్చుకోవడం' అనే వ్యవహారం ప్రారంభం అయ్యే సరిహద్దు ఏ కంభం ప్రాంతంలోనో, నిమకొండ ప్రాంతంలోనో వుండి వుండాలిగదా ! ఆ సరిహద్దు ప్రాంతాల్లో బహుశా రెండు వ్యవహారాలూ వుండివుండవచ్చును. ఆ రీత్యా యీ 'దశకం' అనే పదం మొదట్లో 'అప్పు' అనే పదానికి మాండలికంగా గ్రహింపబడి క్రమేణ భాషలో కలిసిపోయి వుండాలి. మొదట్లో 'అప్పు' గా ప్రారంభమైన యీ 'దశకం' అనే పదం కాలక్రమాన 'అప్పు' అనబడే తన ప్రత్యేక అర్థాన్ని కోల్పోయి కేవలం ఒక లావాదేవీగా డబ్బు వ్యవహారాలకి సంబంధించిన ఒక మాటగా—స్థిరపడి, చివరికి 'డబ్బు' అనే అర్థంలో రూఢమైగూడా స్వతంత్ర ప్రతిపత్తి లేకుండా 'డబ్బు' అనే మాట ప్రక్కన జంట పదంగా స్థిరపడి వుండవచ్చును, లేక—డబ్బు అనే పదం తనవద్ద నిల్వవున్న ధనానికీ—దస్కం ('దశకం' యొక్క పరిణామరూపం) అనే పదం తను అప్పుచేసి సమకూర్చుకోవలసిన ధనానికి — మాచ్యాలయి—ఏదైనా శుభకార్యాలప్పుడు 'డబ్బూ-దస్కం' — చూచుకోవాలిగదా — అన్న వ్యవహారం ఏర్పడి వుండవచ్చును.

ఏమైనా పండితులీ విషయాన్ని పరిశీలించాలి.

—శ్రీ యం. హెచ్. వి. సుబ్బారావు.

## దాశరథిగారి కర్తవ్యము

ఏప్రిల్ 'భారతి'లో దాశరథిగారి 'కర్తవ్యము' కవిత చదివాను. ఇది వారి స్థాయికి తగ్గ రచన కాదనిపిస్తున్నది. ఈ మధ్య వారి రచనలన్నీ అదే తీరుతో వుండటం చూస్తే నాబోటి సాహిత్యాభిమానులకు విచారం కలుగుతోంది. కవిగా వారిపట్ల నాకెంతో సద్భావముంది. కాని ఇటీవల వారి రచనలు చూస్తూ అసంతృప్తితో అభిమానిని కనుక-మిన్నకుండ లేక వ్రాస్తున్నాను.

వారు తమ కవితలో ఉపయోగించిన భాష ఎంత కృతకంగా వున్నదో పర్యాలోకన చేసికొనివుంటే ప్రచురణకు పంపివుండేవారే కాదనిపించింది. "జ్యోతిరోచమనై దిశాంచలములన్ శోభించ లేకున్నచో నీ రేఖ్మమును చిన్ని తిర్యిళకలో నిండింపుమీ..." వంటి పాతవాసనలు కలిగిన వాక్యాలు పోవటం ఆరోగ్యకరం కాదా ! "తిర్యికి"వంటి పదాన్ని ప్రయోగించి అధోజ్ఞాపికలో అర్థాన్ని సహితం యిచ్చుకోవలసినంత ప్రమాదం యేమొచ్చిందో వారికే తెలియాలి ! ఇది భాషాడంబరం పట్ల వారికి తగని చాపల్యాన్ని సూచిస్తోందని నేనంటే నా సాహసాన్ని వారు ఆదరభావంతో గుర్తించాలి. "అంధకారాతంకమ్ము తొలంచుకోరికలు ... ... ... కల్పించున్ మహానందమున్" అన్నపాదములు పూర్తి కాగనే వారి శైలి హఠాత్తుగా ఎందుకు మారిపోయిందో కారణం అనూహ్యం. "దమ్మంటే తోటలునాటు, ఈ బెలు నాటుట మానుమురా !" అంటూ మొదలుపెట్టారు. ఇలాఅనటంలో చమత్కారం యేమైనా వుందేమో వారికే తెలియాలి.

ఇక గేయంలో విషయంగూర్చి రెండు ముక్కలు. ఈ కవితకు పరమార్థం విప్లవకారులనీ, విప్లవకవులనీ దుయ్యబట్టడమేనని స్పష్టంగా అర్థమవుతూనేవున్నది. "దుయ్యబట డంకాదు - నయబోధచేయడమేనని" వారు సమర్థించుకున్నా ఆశ్చర్యపోనక్కరలేదు. వి. ర. సం. ఆవిర్భవించిన క్రొత్తలో శ్రీశ్రీ గారితో ఈ కవి పోగించిన వాగ్యుద్ధం చాలదా ? అవే ఉద్దేశాలతో ఇంకా కవితలు గుప్పించడ మెందుకు ? దాశరథిగారు అ. ర. సం లో కీలకమయిన

పాత వహిస్తున్న కవులు కనుక వారి దిక్ప్రదర్శనగా తమ కవితలలో చూపించటానికి ప్రయత్నించాలే తప్ప తమకు రుచింపని సిద్ధాంతాలతో, వేరొక పంథాలో పయనించేవారిని సరిదిద్దటానికీ—సదుపదేశాలు చేసేందుకూ అవసరం ఏమొచ్చింది ?

అ. ర. సం—వి. ర. సం — రెండు సంఘాలవారికీగల ఆలోచనలలో మౌలికమయినతేడా "వారు సాధింపదలచిన నవసమాజ నిర్మాణానికి వారు ప్రజలను అనుసరించమని చెప్పే మార్గంలోనే వున్నద"ని మేము భావిస్తున్నాము. అలాంటప్పుడు వివరి సిద్ధాంతాల పట్ల వారికి గాఢమయిన విశ్వాసాలు వుంటవి. మొదట శ్రీశ్రీ గారితో సాగిన తిట్టు కవిత్వాలలోనూ — వి. ర. సం. సభ్యులు ప్రచురించిన కొద్దిపాటి వ్యాసాలలోనూ తప్ప — ఎక్కడా అ. ర. సం వారి పద్ధతులను సమీక్షించటం కాని, తప్పుబట్టటంకాని — వారి మార్గం గురించి చర్చించటంగాని ఎక్కడా విప్లవకవులు చేసినట్లు దాఖలా లేదు. వారు నమ్మిన విశ్వాసాలతో ముమ్ముందుకు సాగిపోతున్న వారి కంత తీరికాలేదు. ఇటీవల శ్రీశ్రీగారికి విశ్వనాథ వారితో సాగిన రసవత్తరమయిన 'ఫార్స్' వారి నిజాయితీల గురించిన చర్చకాని—కవిత్వాలగురించో, సిద్ధాంతాలగురించో కాదని గుర్తుపెట్టుకోవాలి.

మరి, — దాశరథి వంటి కవులు ఇంకా ఇలాంటి కవితలు వ్రాస్తూండటం మాబోంట్లకు నిరాశాజనకమే.

అ. ర. సం. కవులు-తాము ఏ మార్గాన సామ్యవాద సమాజాన్ని సాధింప నెందరో — పద్ధతులను చాటుతూ అందుకు సంబంధించిన సిద్ధాంతాల ప్రాతిపదికతో కవితలు వ్రాస్తూవుండాలని కోరటమే యీలేఖ పరమార్థం. ఆరుద్రగారి "రాక్షస విజయం" లాంటి పదునైన కవితలతో — తాము సభ్యులుగా చేర్చుకొనిన వందలాది అభ్యుదయ కవిమిత్రులని ఉత్తేజితులను చెయ్యాలి. అంతే తప్ప ఇకా ఇలాంటి "తప్పు కవిత్వాన్ని" పోలిన (మాటవరసకన్నాను కాని తిట్టు కవితలో ఔన్నత్యం వీటిలో యేదీ?) కవితలు మానెయ్యాలి.

ఇదే కవిగా దాశరథిగారి కర్తవ్యము.

—శ్రీ పంతుల జోగారావు.

## రెండ్రదేవులయే రెంటాల

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కాకతీయ చక్రవర్తి సామంతుడు అంబదేవ మహారాజు శా. శ. 1212 (క్రీ. శ. 1290లో) వ్రాయించిన నీలగంగవరం శాసనమును (ఎపిగ్రాఫియా ఇండికా Vol. 20. Part 6) పురస్కరించుకొని 1945వ సంవత్సరము ఫిబ్రవరి భారతిలో పాల్కురికి సోమనాథుని కాలము విషయమున నొక వ్యాసము వ్రాసియున్నారు. అందు వారు నీలగంగవరం శాసనములోని అంబదేవునిచే మొల్లకలూరు గ్రామమును శివపురముగ బడసిన రెండ్రదేవుల మల్లినాథుడు, శివుని దనకంటి మూడవకంటి యర్పించి యా దేవుని ప్రసాదమువలన మరల నేత్రమును బడసిన దోచయాఖ్య, వీరు ఇరువురు బసవపురాణమున సోమనాథునిచే పేర్కొనబడిన రెంటాల మల్లినాథుడు, దోచమాంబలని గుర్తించినారు. దీనివలన సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాడని తేలినది. కాని వారు శాసన భాగమును చక్కగా పరిశీలింపక సోమనాథుని జనన లింగైక్య కాలములను (క్రీ.శ 1260-1340) నిర్ణయించుటవలన కొందఱు శాసనకాలమునకు సోమనాథుడు యువకుడుగా నుండి, బసవ పురాణ రచనా కాలమునకు పిల్లవాడు కాగలడని యూహించి శాసనములోని రెండ్రదేవుల మల్లినాథుడు బసవ పురాణమున పేర్కొనబడిన రెంటాల మల్లినాథుడు గాడని తీర్మానించిరి. వీరిలో ముఖ్యులు లింగైక్య శ్రీ బండారు తమ్మయ్యగారు. వారు సోమనాథుడు ప్రథమ ప్రతాపరుద్రుని అవగా రుద్రదేవుని కాలమువాడను తమ నిర్ణయమును మార్చుకొనలేక "సోమనాథుడు రెంటాల మల్లినాథుని గూర్చి చెప్పిన విశేషము లొక్కటియు నీ శాసనమందలి రెండ్రదేవుల మల్లినాథుని విషయమున పేర్కొనబడలేదు. దోచమాంబను గూర్చి యాతడు చెప్పిన సంగతులను నిందు దోచయదేవిని గురించి చెప్పిన వివరములకు గూడ నైక్యములేదు శ్రీ గిరియందొడ్డెలగమున బసవపురాణ కథాసూత్రములను దన కెఱింగించిన వారిలో సోమనాథు డొక్క కరస్థల సోమనాథయ్యయే త్రిపురాంతకవాస్తవ్యుడని చెప్పినాడు గాని రెంటాల మల్లినాథ దోచమాంబ లెచటివారో వివరింపలేదు" అని విమర్శించుచు పూర్వోక్తము అయిన బలవత్ప్రమాణములను ద్రోసిరాజని సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాడని సాధించుట కది చాలదని సమర మూలయిన శాసనాంతరములకై పరిశోధింప వలసినదని శ్రీ సోమశేఖరశర్మగారికి విన్నవించుచు 1945వ సంవత్సరము ఆగస్టు భారతిలో నొక వ్యాస

మును ప్రకటించి యున్నారు. "దానిపై శర్మగారింతవనుక మరే మియు బదులు వ్రాయలేదు" అని బసవపురాణ పీఠిక (P71)లో వ్రాసియున్నారు. (Ed. 1952 Vavilla) దీనికి ప్రత్యుత్తరముగా శ్రీ వేటూరి వెంకటరమణయ్యగారు తమ 'సోమనాథుని దేవ్వటివాడు' అను గ్రంథమునందు శాసనమునందలి రెంగ్రేడేవుల మల్లినాథుడు, దోచయామ్య, బసవపురాణమునందలి రెంటాల మలినాథుడు దోచమాంబ ఎటు కాగలరో నిరూపించి (P 97—106) సోమనాథుని కాలమును నిర్ణయించి యున్నారు. ఈ కాలనిర్ణయము నవేకులు సమ్మతించు చున్నను రెంగ్రేడేవుల శబ్దము రెంటాలయైనదని చెప్పుట అసమంజ సముగ నున్నదనియు, సోమనాథుని కాలమునకే రెంటాలయని ద్విపద యందు చేర్కొనబడియుండ రెంగ్రేడేవుల రెంటాలయైనదను పరిణామవాదమునకు స్థానము లేదనియు నెంచి ఇంకను కొందరు పండితులు సోమనాథుని కాలమును రుద్రదేవుని కాలముగా నెంచుచున్నారు.

శ్రీ బండారువారు అన్ని విషయములకును ఆంధ్రగ్రంథమాల నుండి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వెలువరించిన బసవ పురాణమునే ఆధారముగ దీసికొనిన కారణమున వారు రెంగ్రేడేవుల రెంటాల యెట య్యెనో తెలిసికొనలేకపోయిరి. దేశమునందు బసవ పురాణమున కెన్నియో ప్రతులు ప్రాచీనమైనవి యుండగా వానిని విస్మరించి శుద్ధములైన అర్వాచీన ప్రతులను మాత్రము ఆదరించి కూర్చబడిన ప్రభాకర శాస్త్రులవారి గ్రంథములోని అధస్సూచికలనే అందరును నిర్ణయాధారములుగా నుంచుకొనుట పొరపాటు. సోమనాథుని కాలము విషయమున నే పండితుడును తాళపత్ర ప్రతులను చూడలేదు.

బసవ పురాణముయొక్క తాళపత్ర ప్రతులలో అర్వాచీనము లయిన వానిలో మాత్రమే రెంటాలయను శబ్దము గలదు. శుద్ధ ప్రతియైన D 967 (శ్రీ వేంకటేశ్వర విద్యాలయము Oriental Research Institute) వంటి వానిలో మాత్రమే రెంటాలయని యున్నది. అశుద్ధముగానున్న లేదా శుద్ధముగానుండి పురాతనమై శిథిలావస్థకు వచ్చియున్న యే ప్రతిపాదనయందును రెంటాలయని లేదు. వివిధ శబ్దములుండి రెంటాల శబ పరిణామమును సూచించు చున్నవి. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము ఓరియంటల్ రీసర్చి ఇన్స్టిట్యూట్ సందలి D 971 (1)లో రెంగ్రటల యని యున్నది. D 971 (2)లో రెంట్రాల యని యున్నది. R 156లో రెంట్రటల యని యున్నది. ఇవి అశుద్ధ ప్రతులు. వీని మాట అటుండ నిండు. హైదరాబాదు గవర్నమెంటు ఓరియంటల్ మ్యానుస్క్రిప్ట్సు లైబ్రరిలోని No. 70 తాళపత్ర ప్రతిలో రెండవ పత్రము రెండవ ప్రక్క 'రెంగ్రేడేల' యని యున్నది. ఇది శుద్ధమైన ప్రాత ప్రతి. ధారవాడ కర్నాటక విశ్వవిద్యాలయమునందలి కన్నడ వచన సంశోధన విభాగములోని No. 2463 తాళపత్ర ప్రతిలో 'రంగ్రడెల' యని యున్నది. ఇదియు ప్రాచీనమైన శుద్ధ ప్రతియే. దీనినిబట్టి రెంగ్రేడేవులయే రెంటాలయై యుండునని ఏవ్వరికైనను స్ఫురింపకపోదు. రెంగ్రేడేవుల మొదటిపేరు కాగా సోమనాథుని కాలమునకు వ్యవహారమున రెంగ్రేడేవులయై యుండవచ్చును. పాల్కురికి సోమనాథుడు వ్యవహారవాది గావున నా పేరునే ద్విపద పాదమునం దనువుగా రెంగ్రేడేయని వాడియుండును. వివిధ కాలములందు లేఖకులు ప్రతులు వ్రాయునపుడు ఆ యా కాలములందు రెంగ్రేడేవుల పొందిన పేరును మార్చి వ్రాసియుందురు ఇట్లు రెంగ్రేడేవుల శబ్దము రెంగ్రేడేల, రెంగ్రడెల, రెంగ్రటల, (రెంగ్రటల) రెంటాలగా పరిణామము నొంది యున్నదని చెప్పవచ్చును, రెంగ్రేడేవుల రెంటాలయైనదను సోమశేఖరశర్మగారి పరిణామ వాదమున కాధారము ఏంతమాత్రము లేదను బండారువారి వాదము దీనివలన పరాస్తము కాగలదు.

—శ్రీ టి. వీరయ్య

# గ్రంథ విమర్శలు

## మిథ్య (నవల)

రచన : శ్రీమతి శిఖా వెంకటరమణా రాజా. ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు మచిలీపట్నం — సికిందరాబాద్. వెల : రు 2-50 పై: పేజీలు 196 (పాకెట్ సైజ్).

ఈనాడు వారపత్రికలు రచయిత్రులకిస్తున్న ప్రాధాన్యం మరెవ్వరికీ ఇయ్యటం లేదంటే బుజాలు తడుముకోనక్కరలేదు. రచయిత్రుల రచనలపై పాఠకులకు కూడ వ్యామోహం పెరిగిపోయింది. తెలుగు నవలా ప్రపంచమంతా లేడీరైటర్ల రచనలతో తలమున్కలగుచున్నవి. రచయిత్రి రచన లేని పత్రికలేదు. పాఠకులాదరణనుబట్టి రచయిత్రులు నవలలను ప్రచురిస్తున్నారు. ఇటీవల రచయిత్రులు చెత్త నవలలను వ్రాసి తెలుగువారి ముఖాన పడవేస్తున్నారు. అసలు వారేమి వ్రాస్తున్నారో వారికే తెలియటంలేదు. ఒక్క నవల పాఠకులచేత అధికంగా ఆదరింపబడితే తక్కినవికూడా అలాగే ఆదరిస్తారనే నమ్మకంతో పనికిరాని నవలలు వ్రాస్తున్నారు.

రచయిత్రులలో కొందరు శరత్‌కు వారసులమని, చలానికి శిష్యురాండ్రని చెప్పుకొంటూ తమ గురువులకే నామాలుపెట్టి గమ్యాన్ని సాధింపలేక ఆధునిక నాగరికత మోజుతో చిక్కుకొని ఏది సత్యం ఏది అసత్యం అనే వివక్షలేకుండా నవలలు వ్రాస్తున్నారు. సమాజంలో విప్లవాత్మక మార్పులు రావాలని నడుంకట్టి ముందుకు వస్తున్నారే కాని సిద్ధాంతాలమధ్య నలిగిపోయి ఒక స్థిరమైన అభిప్రాయాన్ని తెలియజేయలేక సతమతమవుతూ పాశ్చాత్య వ్యామోహంలో ఉక్కిరిబిక్కిరి అగుచున్నారు. వీరు తమ నవలల్లోని పాత్రలను ప్రాచీన కావ్యముల నాయకులతో సమన్వయించి ఆయా కావ్యములను పూర్తిగా పఠింపక పోయినను భక్తిని ప్రకటిస్తున్నారు. మరికొందరు రచయిత్రులు ప్రాచీన కావ్యములను అత్యాధునిక దృక్పథముతో విమర్శించి ఆయా విషయములను శోధనచేయుచున్నారు. రంగనాయకమ్మ ఈ మధ్య 'రామాయణ విషవృక్షం' అనే గ్రంథం వ్రాసారు. అది గనుక చదివితే రామాయణంపై ఆమె అభిప్రాయాలు వెల్లడి అగును. కాని ఆమె రామాయణాన్ని ఆమూలాగ్రంగా చదివి అర్థంచేసుకొనలేదని పాఠకులు గ్రహింపగలరు. ఇలాంటి రచనలే గనుక తెలుగులో వస్తే భాషకు వినాశనమేగాని వికాసం మాత్రం ఉండదని నొక్కి వక్కాణింపవచ్చును. మనజాతి ఈ రచనలను చదివి ముందడుగు వేస్తుందో వెనుకకడుగువేస్తుందో అని వేచియుండి చూడవచ్చును.

శ్రీమతి వెంకట రమణారాజా ఈ నవలలో శరత్ పాత్రలవలె తీర్చాలని ప్రయత్నం చేసారు. కాని ఆ ప్రయత్నం ఫలింపలేదు. శరత్ తన పాత్రలకు పెట్టిన పేర్లు వీరు తమపాత్రలకు ఉపయోగించుకొన్నారు. ఈ కథలో రచయిత్రి పలుపాత్రలను ప్రవేశపెట్టారు. అందువల్ల కథకు సాఫీదనం నశించి సమన్వయం గజిబిజిగా ఉన్నది.

మనసులున్నా మనువు కుదరదు. అనురాగం ఉన్నా ఆప్యాయత కరువవుతుంది. చిన్ననాటి కలలు కన్నీరు కలిగిస్తాయి. అనే యథార్థాలే కన్నులముందు కానవస్తాయి. ఈ మిథ్య నవలలో కథకూడ ఈ విధంగానే ఉన్నది.

ఈశ్వర చంద్రుడికి మహేశ్వరికి మనసు కుదిరింది. పరిస్థితుల ప్రభావంచేత జీవితాలు మారిపోయాయి. ప్రణయానురాగానికి హద్దులు లేవు. మనువుకు మాత్రం బీదరికం అడ్డువచ్చి వారిద్దరిని వేరుచేసింది. కారాలు మిరియాలు నూరుకొన్నారు. పంతాలు పట్టింపులమధ్య నలిగిపోయారు. సంప్రదాయాన్ని అనుసరించి మహేశ్వరి వివాహమాడింది. ఈశ్వర చంద్రుడు తనకులంకాని పిల్లను తెచ్చుకొని పెళ్ళాడాడు. అప్పటినుండి ఈశ్వరచంద్రుడు—మహేశ్వరి దూరమయ్యారు. కొంతకాలానికి ఈశ్వరచంద్రుని భార్య గౌరి మరణించింది. ఒక ఆడపిల్లను ప్రసవించి, ఆ ఇల్లు నరకమయింది. మహేశ్వరి సానుభూతి కలిగి పురిటిలో బిడ్డనుతెచ్చి పెద్ద చేసింది కన్నబిడ్డ హరికృష్ణకంటె. గిరిజ హరికృష్ణపై మోహం పెంచుకొన్నది. ఒకప్పుడు ఈశ్వర చంద్రుని తండ్రి మహేశ్వరిని నిందించి బయటకు ఎట్లా పంపాడో అదే విధంగా నేడు మహేశ్వరి గిరిజను బయటకు పంపింది. రెండు కుటుంబాలు దూరమయ్యాయి.

ఈశ్వర చంద్రుడు వంగదేశం వెళ్ళాడు. మన్‌మోహన్ ప్రోత్సాహంతో గిరిజ మెడిసిన్‌లో అడుగుపెట్టింది. హరికృష్ణ హైదరాబాద్‌చేరి డబ్బు సంపాదించటం మొదలుపెట్టాడు. త్రాగుడుకు అలవాటు పడ్డాడు. మహేశ్వరికి ధనంఉన్నా సుఖంలేదు. గిరిజ తండ్రి ఈశ్వరచంద్రుడు మరణించాడు. ఆమె మన్‌మోహన్ భార్య అయింది. పెళ్ళయిన తరువాత మోహన్ అమెరికా వెళ్ళాడు పై చదువుకు. కొంతకాలమునకు విమాన ప్రమాదంలో మరణించాడు. గిరిజ విధవ అయింది. కాని హరికృష్ణ గిరిజను పునర్వివాహమాడి అతని మక్కువ తీర్చుకున్నాడు. గిరిజకు ఇదంతా మిథ్యగా కానవచ్చింది. ఇది ఇందులోని కథ.

రచయిత్రి నవలలో చాల పాత్రలు సృష్టించారు. అయా పాత్రల ప్రాధాన్యం కూడ తక్కువగానే ఉన్నది.

ఈ నవలలో మహేశ్వరి పాత్ర విన్నుతగింది. చిన్ననాటి ప్రణయాన్ని కాలదన్ని తనజీవితాన్ని త్యాగంచేసి అవిటివాడైన చంద్రశేఖరుని వివాహం చేసికొని హరికృష్ణను కన్నది. తనకు జరిగిన అవమానాన్ని మరచిపోకుండా పెంచి పెద్దచేసిన గిరిజపై ఉపయోగించి ఆమెను మానసిక వ్యథకు గురిచేసింది. ఈ విధంగా మహేశ్వరి పాత్రలో పగతీర్చుకొనే ఉద్దేశం కల్పించటం ఉచితంగా కానవచ్చుట లేదు. కన్నబిడ్డకంటె అధికంగా చూచిన మహేశ్వరి గిరిజను బయటకు పంపటంకూడ భావ్యంగా లేదు.

మహేశ్వరిలో పశ్చాత్తాపం ఉన్నది. ఆ పశ్చాత్తాపంలోనే గిరిజను తన కోడలిగా గ్రహించి ఈశ్వరచంద్రుని ప్రణయ ఋణం తీర్చుకొన్నది.

గిరిజ పాత్రను రచయిత్రి మౌనంగా ఉంచారు. ఆమెలో వ్యక్తిత్వం తక్కువ. హరికృష్ణపై మోజుపెంచుకొని గాలిమేడలు కట్టుకొన్నది. కాని మహేశ్వరి మాటతో అవన్నీ ఒక్కసారి కూలిపోయాయి. ఎదిరించే సాహసం లేక మిన్నకున్నది. యథార్థాన్ని గ్రహింపలేదు. మన్‌మోహన్‌ను వివాహం చేసికొన్నదేగాని పరిపూర్ణమగు ఆనందాన్ని పొందలేకపోయింది. ఎవరినైతే మహేశ్వరి వివాహమాడరాదని ఆంక్ష పెట్టిందో తుదకతన్నే గిరిజ వివాహం చేసికొన్నది. ఈ వివాహం కూడ హఠాత్తుగా జరిగింది.

ఈశ్వర చంద్రుడు పట్టుదల గలవాడు. మాట్లాడిన మాటలో అర్థం ఉంటుంది. జరిగిన దానికి విచారింపక జరగబోయే దాన్ని గూర్చి పరిశీలనచేసి కుమార్తెను మెడిసిన్ చదివించాడు. అయితే ఆమెజీవితాన్ని చూడకముందే ఈశ్వర చంద్రుడు కన్ను మూశాడు.

కథ ప్రారంభోపసంహారాలు బాగున్నాయి. విధవా పునర్వివాహం చివరలో చిత్రించారు. పాత్రలధికంగా ఉండటంచేత కథలో బిగువు తగ్గిపోయింది. దరిదాపు ముప్పది పాత్రలకు మించి ఉన్నాయి. ఇన్నిపాత్రలుకూడ ఈ నవలలో అనవసరమనిపిస్తుంది.

ఎమెస్కోవారు నవలలను ముందు చదివి ప్రచురిస్తే మంచి నవలలు రావటానికి అవకాశం ఉంటుంది. అచ్చుతప్పులు సరిదిద్దక పోవటం విచారింపవలసిన విషయం.

రచయిత్రి నవలను అధిక ప్రసంగంతో నింపారు; లేకుండాఉంటే చక్కగా ఉండేది. భావిలో మంచి నవలలు వ్రాయటానికి ప్రయత్నిస్తారని ఆశింపవచ్చును

—శ్రీ రామమోహన్.

## ఆంధ్రరస గఙ్గాధరము

ద్వితీయభాగము. సంస్కృతమూల సహితము. అనువాదకులు న్యాయశిరోమణి శ్రీ వేదాల–తిరువేంగళాచార్యులు, డెమ్మీసైజు. 16+800 పుటలు. వెల 16 రూ. ప్రకాశకులు–ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి, కళాభవన్. సైఫాబాదు, హైదరాబాదు–4.

సంస్కృతంలోని అలంకార శాస్త్రగ్రంథాలలో జగన్నాథపండితరాజు రచించిన రసగంగాధరం విశిష్టమైనది. మహాప్రతిభాశాలీ, సర్వశాస్త్రాలలోనూ కూలంకష పాండిత్యం గలవాడూ అయిన ఆ వాగ్దేవతామూర్తి అప్పటివరకూ ప్రసిద్ధంగా ఉన్న గ్రంథాలన్నింటినీ పరిశీలించి, వివిధ గ్రంథాలలోని దోషాలను సప్రమాణంగా చూపుతూ, విశిష్టలక్షణాలను నిర్వచిస్తూ, తాను స్వయంగా రచించిన ఉదాహరణలతో వివరించాడు. ఇందలి పరమతఖండన పండితరాజు సునిశిత ప్రజ్ఞకు తార్కాణం.

"రసగంగాధరం" అనే పేరునుబట్టీ, విభాగాలకు ఆననాలనే

పేరు ఉండుటబట్టే ఇందులో అయిదు ఆననాలు ఉండవలసినట్లు తోస్తున్నది. కాని మనకు లభించినవి రెండు ఆననాలు మాత్రమే. రెండవ ఆననం కూడా అసమగ్రంగానే లభించినది.

ఉత్తరాలంకార వివరణలోని

'కిం కుర్వతే దరిద్రాః
కా సారవతీ ధరా మనోజ్ఞతరా
కో పావన స్త్రిలోక్యాం

...   ...   ....

అనే అసమగ్రశ్లోకంతోనే ఉపలబ్ధ గ్రంథం పూర్తి అవుతున్నది. పండితరాయ ఈ గ్రంథాన్ని అసమగ్రంగా రచించాడో, ఒకవేళ పూర్తిగా రచించినా, మనకు అసమగ్రంగానే లభించిందో చెప్పలేము. ఇందలి ప్రథమాననంలో కావ్య రస స్వరూపచర్చలు, ద్వితీయాననంలో సంలక్ష్యక్రమ వ్యంగ్యవివరణ, ఉపమ మున్నగు డెబ్బయి అలంకారాల వివరణ ఉన్నవి మిగిలిన ఆననాలు ఇతర విషయాలకు ప్రత్యేకించబడి ఉండవచ్చును. అవి అలభ్యంగా ఉన్నందున ఏ విషయాన్నీ ఇదమిత్థమని నిర్ణయించలేము. ఇది అసమగ్రంగా ఉన్నా, ముఖ్యమైన విషయాలు విపులంగా ఉండడంవల్ల అలంకారశాస్త్రంలో గట్టిపాండిత్యం సంపాదించగోరువారి కవశ్య పఠనీయంగా ఉన్నది.

ఇట్టి ఉత్తమగ్రంథానికి తగిన వ్యాఖ్య సంస్కృతంలో లేదు. నాగేశభట్టు రచించిన టిప్పణిక పేరునకు మాత్రం ఉన్నది. అది మూలార్థావగతికి ఎక్కువ ఉపయోగించేదికాదు. తర్క, వేదాంతాది శాస్త్రాలలో గట్టి పాండిత్యం ఉన్నవారే దీనిని అర్థం చేసుకోగలరు గురుముఖతః అభ్యసించి, పరిశీలన చేసేవారికే—ఇతర శాస్త్రాలలో కూడా ప్రవేశం ఉన్నవారికే ఇది బోధపడుతుంది. దీనికి తగిన అనువాదం లేకపోతే ఆంధ్రభాషా వాఙ్మయ విద్యార్థిమర్శకులు ఇందలి విషయాలను గ్రహించడం సాధ్యమయ్యే పని కాదు.

ఈ రసగంగాధరానికి సుప్రసిద్ధ సాహిత్యవేత్తలు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి 'నవరసగంగాధర మనే ఆంధ్రానువాదం ఉన్నది. అయినా అది దీనివలె విపులమైనది కాదు. దాని రచన ప్రౌఢంగా సాగి ఉన్నందున విద్వాంసులకు మాత్రమే అవగాహన చేసుకొనుటకు వీలుగా ఉన్నది. అందువల అందరూ సులభంగా గ్రహించుటకు అనుకూలమైన తెలుగుసేత అవసరమయ్యే ఉన్నది.

దీని అనువాదకులు శ్రీ వేదాల- తిరువెంగళాచార్యులుగారు గొప్ప ప్రతిభాశాలి. న్యాయశాస్త్రంలో నిష్ణాతులు పూర్వోత్తర మీమాంసా సాహిత్య శాస్త్రాదులలో సమర్థులు. వీ రిదివరకే వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిని, ఆనందవర్ధనుని ధ్వన్యాలోకాన్నీ అనువదించి ఆంధ్రుల ప్రశంసలను అందుకొన్నారు. ఆయన ఈ రసగంగాధరాన్ని కూడా తెలిగించడం ఆంధ్రుల అదృష్టమే అని అనుకోవాలి.

శ్రీ ఆచార్యులుగారు రసగంగాధరంలోని ప్రథమాననాన్ని ప్రథమభాగంగ 'ఆంధ్రరసగంగాధర' మనే పేరుతో రచించారు. అందు సంస్కృతమూలం, ఆంధ్ర వ్యాఖ్య ఉన్నవి అవి మూలార్థావగతికీ, విశేషార్థ వివేచనకూ ఎంతో ఉపయుక్తంగా ఉన్నవి. దానిని 1969 లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారే ప్రచురించారు. ఉపలబ్ధమైనంతవరకూ ద్వితీయాననాన్ని ద్వితీయ భాగంగా 1973లో వారే ప్రకటించారు.

ఈ రెండు భాగాలలో మొదటిది చాలా చిన్నది. రెండవది చాలా పెద్ది తొలి భాగంలో సంస్కృతమూలం, తెలుగు తాత్పర్యం, శర్వాణీవ్యాఖ్య ఉండగా రెండవభాగంలో సంస్కృత మూలం, సంగ్రహమైన ఆంధ్రానువాదం మాత్రం ఉన్నవి. ఇట్లు సంగ్రహించినా గ్రంథం ముద్రణలో 789 పుటలవరకూ పెరిగింది. వ్యాఖ్యానంకూడా ఉంటే ఇంకా గ్రంథం పెరిగి, అందరికీ సులభంగా లభ్యం కాకపోవచ్చుననే సంకల్పంతో ఆచార్యులుగారు ఈ భాగానికి వ్యాఖ్యను వ్రాయక విడిచిపెట్టి ఉండవచ్చును.

దీని ప్రథమభాగానికి శ్రీ ఆచార్యులుగారి పీఠిక లేదు. ద్వితీయ భాగంలోని 'ప్రస్తావన'లో ఆయన 'పండితరాజ జగన్నాథుని వైదుష్యము' ను గురించి విపులంగా చెప్పుటకు పూనుకొని 14 పుటలలో

ఉపమాలంకారం తుదివరకూ చర్చించారు. ఇంకా చెప్పవలసినది ఏంతో ఉన్నది. ఆ ప్రస్తావన అసమగ్రంగానే కానవస్తున్నది. దానిని పూర్తి చెయ్యకముందే ఆయన దివంగతులైనట్లు తోస్తున్నది. ఉన్నంతవరకూ అది మూలగ్రంథంవలెనే అమూల్యాలైన విషయాలను వివరిస్తూ ఉన్నది.

శ్రీ తిరువెంగళాచార్యులుగారి ఈ అనువాదం మూలాను గుణంగా—కఠినమైన మూలం అభిప్రాయాన్ని సరళమైన తెలుగులో సాగింది. మచ్చుకు—

"యదప్యుక్తం ప్రకరణాదిజ్ఞానాత్ ప్రాకరణికేఽర్థే తాత్పర్య విషయతయా నిర్ణీతే తదీయ శాబ్దబోధానన్తర మతాత్పర్యవిషయీభూతార్థబోధో జాయమానో వ్యఞ్జనవ్యాపారసాధ్య ఇతి — తత్ర విషయం నానార్థస్థలే సర్వత్రైవ వ్యఞ్జనోల్లాసః అహోస్విత్ క్వచిదేవేతి నిష్కృష్టవ్యః; నాద్యః—ప్రాకరణికా ప్రాకరణికయోరర్థయోః శాబ్దబుద్ధౌ సర్వత్రాభ్యుపగమ్యమానాయాం తాత్పర్యజ్ఞానకారణతాయాః కల్పనస్య నైరర్థక్యాపత్తేః"

(అనువాదం) మరియు ప్రకరణాదుల నెరుగుటవలన ప్రాకరణికమగునర్థము తాత్పర్యవిషయమని నిర్ణయము కాగా నా యర్థపు శాబ్దబోధ కల్గిన తరువాత తాత్పర్యగోచరముకాని యర్థపు శాబ్దబోధకూడా కల్గుచున్నది. అది వ్యంజనావ్యాపారమువనే సాధ్యమ అనెదరా మీరు ? ఈ వ్యంజన నానార్థక స్థలములందంతటను నా యునా ? కాదు—ఏదో ఒక చోటనే యనియా మీ యభిమతము: మొదటి పక్షము కుదురదు. ఏమంటే—ప్రాకరణికార్థము, అప్రాకరణికార్థము—ఈ రెండర్థములకును గూడ అంతటను శాబ్దబోధ గల్గునని యంగీకరించుచుంటిరిగదా మీరు! ఇక తాత్పర్యజ్ఞానమును కారణముగా నంగీకరించు టెందుకు ? అది నిరర్థకమే కావవచ్చును. [పుట 9]

శ్రీ తిరువెంగళాచార్యులుగారు మూలగ్రంథాన్ని చక్క పరిశీలించి, దిద్దవలసినచోట్ల దిద్ద తగినట్లు తర్జుమా చేశా. గ్రంథం చివర అసమగ్రంగా ఉన్న శ్లోకపాదాన్ని 'కింకుర్యాత్ శ్లోకం నాల్గవ పాదాన్ని 'కంసం జఘ్నే రిపుం కృష్ణః' అని చక్క పూరించి అనువదించారు.

సాహిత్యశాస్త్రవేత్తలూ, జిజ్ఞాసువులూ అందరూ ఆదరింపవలసిన ఉత్కృష్టగ్రంథం యిది.

—బులుసు వెంకట రమణయ్య.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Pat Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 7522(